మైలవరం శ్రీ బాలభారతీ సమాజమువారిచే ప్రదర్శింపబడు

శ్రీ

# ధరణికోట

రెడ్డివీరుల సంగ్రామకథ

## 7 అంకముల నాటకము

ఇది

స్వరాజ్యరథము, సతీ అనసూయ, గంగావతరణము, భీష్మ బ్రహ్మచారి, రంగూన్ రౌడి, తాజ్ మహలు మున్నగు ననేక నాటకములను రచించిన

దేశపాండ్యా

## సోమరాజు రామానుజరావు గారిచే

రచియింపబడినది.

★

ప్రకాశకులు:

## కురుకూరి సుబ్బారావు సన్.

(కురుకూరి స్వరాజ్య వెంకట సత్యనారాయణరావు)

ప్రొప్రయిటరు:

## సరస్వతీ బుక్ డిపో, బెజవాడ.

మూడవకూర్పు 500 ప్రతులు

స్వకీయ సరస్వతీ ప్రెస్సునందు ముద్రింపబడినది.

1945

 [వెల I-8-0

## —: పురుషులు :—

1. ఖడ్గనారాయణుఁడు—కథానాయకుఁడు
   (కేదారనాథుఁడు—ఖడ్గనారాయణుని మారువేషము
2. అనవేమారెడ్డి—ఖడ్గనారాయణుని తండ్రి
3. అనపోతనాయుఁడు—రాచకొండరాజు; రెడ్ల శత్రువు.
4. కొండారెడ్డి—అనపోతనాయుని సేనాని
5. వీరారెడ్డి—అనపోతనాయుని మంత్రి; కొండారెడ్డిమామ
6. మల్లినాథుఁడు } ఖడ్గనారాయణుని మిత్రులు
7. కృష్ణరాజు }
   పఠాణీలు—ఖడ్గనారాయణ మల్లినాథ కృష్ణరాజుల మారువేషములు
8. వెంకన్న—అనపోతనాయుని సేవకుఁడు
9. ఎఱ్ఱాప్రగడ—అనవేమారెడ్డి మంత్రి
10 మాధవనాయుఁడు—అనపోతనాయుని తమ్ముఁడు

## —: స్త్రీలు :—

11 వీరభద్రి—కథానాయిక; వీరారెడ్డి కుమార్తె
   వీరభద్రుఁడు—వీరభద్రి మారువేషము
12 అన్నపూర్ణ—వీరభద్రి సఖి; కొండారెడ్డిని వలచినది
   (కళాపూర్ణుఁడు—అన్నపూర్ణ మారువేషము
13 నీల—అన్నపూర్ణ సఖి
   (విక్రమరాజు) నీల మారువేషము
14 రాణి—అనపోతనాయుని భార్య
15 మాలి—రాచకొండదివాణపు దాసి

---

# ధరణికోట

—* రెడ్డివీరుల సంగ్రామకథ *—

## ప్రథమాంకము

### రంగము 1

(రాచకొండలోని, వీరారెడ్డి మందిరమున.)

ప్ర॥ కొండారెడ్డి, వీరారెడ్డి.

కొండా — వెనుకటి మాటలకేమి? ప్రస్తుతపు సంగతి ననుసరించి మాటలాడఁ గూడదా?

వీరా — నాయనా! అట్లుగాదు. నామాట వినుము. మన వీరభద్రి కింకను బాల్యము గదా! ఇప్పుడు దాని వివాహప్రశంస యెందులకు?

కొండా — మామా! నీ మాటలను నాకు నవ్వువచ్చుచున్నది. వీరభద్రి యింకను బాలిక యేనా? వివాహకాలమే సమీపించ లేదనుచుంటివా? ఇది నన్ను బుజ్జగింపఁ బెట్టుటకు వచించు వేషపుఁబలుకులు గాని,

సీ. చిఱునవ్వు వెన్నెలల్ చిందులాడెడు ముఖేందు
మండలమ్మునుఁ గల్గు మందగమన
యువజనంబుల గుండె లవియఁజేసెడు, క్రూర
నిశితాంబకంబుల బిసరుహాక్షి
ప్రణయప్రశంసచే, నణుమాత్రమరుణమౌ
చెక్కుటద్దమ్ముల చిన్నెలాఁడి
బాల్యంబుదొలఁగిపోఁ బరువంపు మిసమిస
లారంభమగుచున్న యలరుఁబోఁడి

గీ. పదియునై దేండ్లు పైఁబడ్డ పద్మగంధి
సకలవిషయవిజ్ఞాన ప్రశస్తశీల
యైనవీరభద్రయు, బాలయగుననేని
బాలలిఁక జన్మమందని వారుగారె!

చిన్ననాటినుండియు, వీరభద్రను, నాకిచ్చి వివాహము చేయుదునని, యాశ పెట్టితివి. ఇప్పుడు నీవిషయము చూడఁగా వేఱు భంగియైనట్లు తోఁచుచున్నది. నేను,

నీ మేనల్లుఁడనగుటచే వీరభద్రుని వరియింపఁజూచుటకు నాకన్న నధికారముగలవారు లేరు. నా కూఁతురకు కోపమును దెప్పించకుము. వార్ధక్యమును పాడుజేసికొని ముసలితనమున లేనిపోని యారాటము పాలుగాక సక్రమముగ, వీరభద్రినకు నాకుఁ గన్యాదానము చేయుము.

వీరా—నీవు లేనిపోని యనుమానములు, కడుపులో నుంచుకొని ఏమేమో—పలుకుచున్నావు, కాని యన్నపూర్ణ—మొదటి నుండియు—నీపై ననురాగముతో నున్నందున, పాపము దాని నన్యాయముచేసి, నీకు వీరభద్రినిత్తునాయని, యాలోచించుచున్నాను,

కొండా—ఓహోహో! ఎంతపరోపకార పరాయణుఁడవు! అన్నపూర్ణ నన్ను వలచినదఁట! తాను—పుత్రికావాత్సల్యమును సహితము మానెనఁట!—సత్యహరిశ్చంద్రుని చంపి పుట్టితివిమామా! నీకుటిలబుద్ధిని నాకడనా చూపెదవు! నెవింకను బాలుఁడననుకొంటివా లాలించుటకు? నాకుఁగల సమర్థత నాకును గలదు, నీవు వీరభద్రినీయనని— బెట్టుచేసినచో—నీమాటలకు మోసపోయి, విశ్వసించి యూరకుందునని, యెుకనాఁడుం దలంపకుము. ఏవిధమువైతనైన—వీరభద్రిను, నేను, వివాహమాడియే తీరెదను,

గీ॥ చదివినాఁడను ♦ సకల శాస్త్రములు నేను
రాజునకు ముఖ్యుఁడను నేను ♦ రాచకొండ
సేనలకు నధిపతినైతి ♦ చిన్ననాటి
మాటలేటికిఁ బల్కెదో ♦ మామ! నీవు!

వీరా—అదికాదు-నాయనా! నిన్ను నే నేమంటినని, యంతగా నాగ్రహించెదవు? మొదఁటినుండియు—నన్నపూర్ణకును, నీకునుఁగదా—యానుకూల్యము మెండు అన్నపూర్ణ యభిప్రాయము నెఱింగి నీకిట్టే వీరభద్రిను............

కొండా—అన్నపూర్ణకును, నాకును, చిన్ననాటినుండియు—నానుకూల్యమా! ఎవరు చెప్పిరి నీతో? అన్నపూర్ణ యట్లు చెప్పినదా? కాక, నీవు చూచితివా మాయానుకూల్యమును? అనుకూల్యమనుమాట కర్థమేమి? వీరభద్రి నన్ను వలదనినా—దానికి లేని యారాటము నీకేల? నీకీమాధ్యస్థమేల? నిచెత్తనమేల? ఇన్నిమాట లెందులకు? నేను విషయములన్నియును వింటిని—నీవు, మన రాజునకు వైరులగు కొండవీటి రెడ్ల కెవ్వరికో—నీకుమార్తె నిచ్చెదనని, వారితో వీరితో—ననుచున్నావట—నాకు తెలిసినది. ఈమాట రాజా చెవిఁబడినచో—నీగతి యేమగునో—యాలోచించుకొనుము, అంత అభిమానము గలవాఁడవైనచో—రెడ్డివై యుండియు—తొలుత నుండియు—వెలమల నేటికి-పొట్టకూటికిఁ గొల్చుచుంటివి?

(తెరలో) కొండారెడ్డిగారూ—కొండారెడ్డిగారూ.

కొండా—ఎవరది?

(తెరలో) రాజాగారి సెలవైనది.

కొండా—ఐదె వచ్చితిని, మామా! సరే! నీవు—నాకు ప్రత్యుత్తర మీయవక్కరలేదు. ఒక్కటేమాట చెప్పెదను.

గీ. నాకు నన్యాయ మొనరించి నీకుమారి
నింకొకనికిచ్చు యత్న మొకింత నాదు
చెవినిఁ బడెనేని యప్పుడె నీజీవితంబు
సాంతమగు; వీరభద్ర వితంతువగును.

(కొండారెడ్డి కోపముతో పోఁబోవుచుండును ఖడ్గనారాయణ మల్లినాథు లెదురగుదురు. కొండారెడ్డి వారిని తీవ్రముగ బరికించి నిష్క్రమించును.)

వీరా—ఎవరు నాయనా మీరు?

ఖడ్గ—అయ్యా వీరారెడ్డిగారింటివద్ద నున్నారా?

వీరా—మీరెవ్వరు? మీవేషభాషలవలన మీరు మహారాజకుమారులవలె గనఁబడుచున్నారు. నేనే వీరారెడ్డిని. నావలన మీకేమి కార్యమున్నది? మీ రెక్కడనుండి వచ్చినారు!

ఖడ్గ—మావృత్తాంతమును, మీకు సావకాశముగ మనవిచేసెదను. మేము మహారాజకుమారులము కాము. కాని యొక మహారాజునకు ముఖ్య సేవకులము. రాజకార్యధురంధరులమై వచ్చినాము. మమ్ము మీరతిథులుగా పరిగ్రహింపవచ్చును.

వీరా—ఓహో! అలాగునా? మీరు వెలమలా? రెడ్లా? కమ్మలా లేక......

ఖడ్గ—నేను రెడ్డబిడ్డను. ఈతఁడు బ్రాహ్మణకుమారుఁడు.

వీరా—ఓహో! అట్లయిన నభ్యంతర మేమున్నది. దయచేయుఁడు.

ఖడ్గ—మేము ధరణికోటనుండి వచ్చినాము. కొండవీటి యనవేమారెడ్డి పంపిన రాయబారులము. మాకు మీరాజాగారగు ననపోతనాయుని దర్శనము చేయింపవలెను.

వీరా—అట్లే మాటలాడుదము. రండు.

(అందరు నిష్క్రమింతురు)

## 2 వ రంగము.

(రాచకొండలోని వీరభద్రు నంతఃపురము)

(ఖడ్గనారాయణుఁడు శయనించియుండఁగా వీరభద్రుడును అన్నపూర్ణయు ప్రవేశింతురు)

అన్న—వీరభద్రా! వీరభద్రా! భోజనమైన సరిగా చేయనీయక యింతత్వరగా రమ్మని నన్నెందులకు రప్పించితివి? నేను వినవలసిన విశేషము లేమియు లేవుగదా!

(1 వ అనుబంధము)

వీర—గట్టిగ మాటాడకు—అజగవ్యోమహాకారమును, చక్కఁగఁజూచి, సృష్టియందు బ్రహ్మదేవున కెంత చాకచక్యమున్నదో కనిపెట్టు. —

అన్న—కనిపెట్టితిని—ఆహ్హా! ఎంత సుందరపురుషుఁడు—ఆసౌందర్యమునుఁ జూచుటకు, రెండుకన్నులు చాలవు. చెలీ! వీరభద్రా! అతఁ డెవ్వరో చెప్పఁగూడదఁటే.

వీర—తొందరపడకు నిన్నరాత్రి జరిగిన యంతర్నాటకమున కితఁడే కథానాయకుఁడు.

అన్న—అలాగునా—అట్లయిన, కథానాయకివి నీవు కాఁబోలు నేమి?

వీర...చప్—నోరుమూసికొనుము ఇంక నావంటరా! తక్కిన సంగతులు చెప్పెదను.

(ఇరువురు కూర్చుందురు)

వీర—చెలీ

ఆ. కొండవీటిరెడ్డి కుల ♦ నాథుండు వరఁగ
ధరణికోటనుండి ♦ లెడయకీర్తుఁడు
రాయబారిగాఁగ నీ ♦ యోధవరుఁడు తా
నరుగుఁదెంచె విక్రమాఢ్యుఁ ♦ డగుచు.

అన్న—చెలీ! ధరణికోటలో, నితని కేమి యుద్యోగమున్నది?

వీర—ఆసంగతి నాకంత బాగుగా తెలియదుగాని, యువరాజున కితఁడు. ప్రాణమిత్రుఁడఁట! అనఁగా—నేదో గొప్పయుద్యోగము నందే యుండవచ్చునని, మన మూహింపవచ్చును. ఆసుందర విగ్రహముం జూచినప్పటినుండియు, నాహృదయము.........

అన్న—ఊఁ ఊరకుండెదవేల? కానిమ్ము నీ హృదయము? ఏమగుచున్నది? తహతహ పడుచున్నది. వ్యాకులమొందుచున్నది. త్వరపడుచున్నది ఇంతేనా?

వీర—ఛీ! ఏమిమనిషివి? నీ జన్మకాలనక్షత్ర మెట్టిదోకాని యీపాడు వేళాకోళము నిన్ను విడువకున్నది.

అన్న...భద్రా! భయములేదు చెప్పు—చెప్పు

వీర...చెప్పకముందే పరిహాసమున కారంభించితివానవు, చెప్పిన నింకెంత యల్లరి చేసెదవో యని గొంకుచున్నాను.

(2 వ అనుబంధము)

అన్న—వీరభద్రా! ఏదో యొకమారు పరిహసించితినిగాని, మాటిమాటికి నట్లనుటకు—నేనేమంత యవ్యక్తురాల ననకొంటివా?

వీర—నాహృదయము తామరాకుపై, నీటిబొట్టువలె చలనశీలమై—యూరక కొట్టుకొనుచున్నది. నిన్నటిరాత్రి చాలసేపటివరకు, నా వివాహమును గూర్చి

మామయ్యయు, నీతండ్రియు ప్రసంగించిరి. నేను చాటుననుండి వారి సంభాషణ మంతయు వింటిని.

అన్న—ఏమి సంభాషించుకొనిరి? ఆసంభాషణలో నీతనికి నీయెడ ననురాగమున్నట్లు తేటపడినదా? నీతండ్రిమాటలు నీయభిప్రాయమున కేమైన ననుకూలముగా నున్నట్లు తోcచినదా?

వీర—చెలీ! ఈతనికి నాపై, ననురాగములేదని చెప్పcజాలను. మాతండ్రి మాటలు నాకంత లాభకరమైనవి గావు.

అన్న...'అంత లాభకరములు కా' వనcగా కొంతవరకు లాభకరములని యర్థము. ఆ కొంత లాభకరమైన దేదో చెప్పు.

వీర—నన్ను ధరణికోట యువరాజైన యనపోతారెడ్డికిచ్చి, వివాహము చేయుటకు వారిరువురును నిశ్చయించిరి.

అన్న—ఓహో! బాగుగానున్నదే! అటులైన నీ వదృష్టవంతురాలవేకదా! యువరాజును బెండ్లియాడినచోc గ్రమక్రముగా నీవు కొండవీటిసీమకెల్ల మహారాజ్ఞివి కాcగలవు వీరభద్రా! అప్పుడు నీవు నన్ను బలుకరించెదవా?

వీర—చెలీ! నిజము చెప్పెద వినుము. నాకాసంబంధ మిష్టములేదు. నాకాయైశ్వర్య మక్కరలేదు.

అన్న—ఎందుచేత?

వీర—నాకిష్టములేనప్పు డెందుచేతనైననేమి?

(౩ వ అనుబంధము)

అన్న—సరే! అట్లయినయెడల నాకా యువరాజక్కరలేదనియు, ఊరునుc బేరునుc దెలియని యీ రాయబారి యొవcడో వానికే యిచ్చి వివాహము చేయవలయు ననియు, మీ తండ్రితోc జెప్పరాదా.

వీర—నీ తెలివికి సంతోషించితినే! ఈపాటి యుపాయము నెఱుcగక, నిన్నుcబిలువ లేదు. అన్నపూర్ణా! నామనోభిప్రాయము నిను నీకుc దెలిపితినిగదా! ఈసంగతి నెట్లయిన నీవు మాతండ్రితోc జెప్పవలసియున్నది.

(తెరలో) ఖడ్గనారాయణ గారూ—ఖడ్గనారాయణ గారూ

వీర—అన్నపూర్ణా! నీవు గవనిలోని కేగి తెలుపుము. ఆయనకొఱకెవరో వచ్చినారు.

అన్న—నేను తెలుపను నీవే తెలుపుము.

వీర—అబ్బా! నాకు సిగ్గువేయుచున్నదే! నీవు తెలుపకూడదాయేమి?

అన్న—నేనే యంతసిగ్గులేనిదానను కాcబోలును!

వీర—అబ్బ తల్లీ! ఎంతవడిదానవే!

అన్న—ఏమి! నీకంత యభిమానమేల? నీవేల తెలుపcగూడదు?

ఖడ్గ...(లేచి) మీరెవ్వరును తెలుపనక్కఱలేదు. నేనే మేల్కొనియున్నాను.

క. ఏలా మేల్కొలుపుటకో
బాలామణి! యింత సిగ్గుపడియెదు? నీ ప్రే
మాలోకనంబులను దృఢ
జాలంబులఁ బన్నితి; నెఱుఁగు జనియెన నబలా!

వీర—కపటము వహించి దొంగనిదురఁబోవు మీవంటివారిని బంధించుటతో సరిపోవదు పరిహారణంబులు సయితము కావలసినదే! [పూలదండవిసరి, వీరభద్రయు అనుసరించి యన్నపూర్ణయు నిష్క్రమింతురు]

ఖడ్గ—(పూలదండ తీసి కన్నులకద్దుకొని]

(4 వ అనుబంధము)

ఆహా! ధన్యుఁడనైతినిగదా!

ఆ. లలన, సన్నఁగాంచి యీ జాభరంబున,
మరుని చేతి విల్లు మ్రొక్కవంగ
విఁటికోలనుండి వెడలి పుష్పాస్త్రముల్
నాదు గుండెలవియు నట్లొనర్చె!

మల్లి—(ప్రవేశించి] మిత్రమా! భగవత్ ప్రసాదమాయేమి? కన్నుల కద్దుకొనుచున్నావు?

ఖడ్గ—మిత్రమా! మల్లినాథా! వచ్చితివా! నీతో—నొకవిశేషము నెఱిఁగింపవలయునని యుంటిని.

మల్లి—క్రొత్త పెండ్లికుమారునివలె—కలకల లాడుచుండిన నిన్ను చూడఁగనే—యేదో విశేషముగలదని తలపోసితిని—ఏమావిశేషము?

ఖడ్గ—మిత్రుఁడా! వీరారెడ్డి కుమార్తెయగు, వీరభద్రకు నాపై గాఢమగు వలపున్నట్లు నేఁడు వారిమాటలవలనఁ దెలియవచ్చినది. నేను వారియెదుటకు వచ్చునప్పటికి సౌందర్యభద్రయగు వీరభద్ర నాపై నీపూలదండ విసరి చనినది చూడు.

[5వ అనుబంధము]

మల్లి—మిత్రమా! కొంతకాలమోపిక పట్టితివేని, నీకునోరథము సిద్ధించును. నీకు కళ్యాణకాలము సన్నిహితమైయున్నట్లు మొన్న మాతండ్రిగారికడ కాలాంతికులు వచింప వినలేవా? కావున శుభసమయము వచ్చినది.

(తెరలో] ఇంకను కాలేదు—కొలదివ్యవధి కలదు.

మల్లి—హా! ఏమది! శుభము సంకల్పింపఁగా నీ దురుపశ్రుతి వినఁబడినది.

(తెరవంకఁజూచి) ఎవరాడుకొన్నది?

(మరలఁ దెరలో]

ధనశ్రీ కోరిక ప్రకారము—ఆమె తల్లిదండ్రుల కా సంగతిసర్వమును, నెఱిఁగించినది. అప్పుడు నేను చాటుననే యుండి, యీమాటలన్నియు—ఇంకనైన, నిజము నొప్పుకొందువా? ఏమి మాటాడవు?

అన్న—కొండారెడ్డి బావా! అన్నియుఁ దెలిసిన పిదప నన్నిట్లు—తర్జన భర్జనములు చేయనేల? క్షమింపుము—

[7వ అనుబంధము]

కొండా—అన్నపూర్ణా—నీవు నట్టి యుపాయకురాలవు—వీరభద్రుకన్న గడుసుదన మైనను నీకు లేదు. అబద్ధమాడుటయైన నెట్లో—తుదకు నీకుఁ దెలియదు. అందుచేతనే, నాయొద్ద బయలుపడిపోతివి—పోనిమ్ము ఐననేమి? ఒక్క సంగతి మాత్రము నేను చెప్పక తీరదు—నీవు వినక తీరదు—పాపము మన వీరభద్రుకు—ఖడ్గనారాయణుని యందంత, యనురాగముండుట సంతోషమే—కాని వాని సంగతి యేమైన—నాలోచించినదా?

అన్న—ఏమి యాలోచింపవలెనో—సెలవిండు—

కొండా—అట్లడుగుము. నీవు మంచి బుద్ధిగలదానవు—విను—ఖడ్గనారాయణుఁ డిచ్చట ప్రవేశించినప్పటినుండియుఁ—బట్టణమున, స్వేచ్ఛగాఁ దిరుగుచు—ప్రతిస్థలమునందును—నా మహారాజుగారి, ననరాని మాటలాడి, యూరక దూషించుచున్నాఁడఁట. ఆ సంగతి యెట్లో రాజుగారికి తెలిసినది. ఇంక వానిపాట్లు నీవే చూడఁగలవు.

సీ॥ వీరభద్రునిఁ బొందఁ వీక్షించినట్టి యా
మాయావి నరకాల రాయువఱకు
ధరణికోటను నేలఁదలఁచిన యాక్రూరు
యమపురంబునఁ జేరనంపువఱకు
భ్రమియింపఁజేసి వీరారెడ్డి కనుఁగప్పి
నట్టి దుర్మార్గు మట్టాడు వఱకు
వలఁచి నా మదనసౌభాగ్యలక్ష్మిని హరి
యించ నెంచిన ద్రోహిఁ ద్రుంచువఱకు
కనుమొఱఁడ్పను; దర్బారు దినమునాఁటి,
తనయవస్థనుఁ గాచుకొమ్మనుము, పిదప
లేమ వీరభద్రునుఁ గౌగిలింపవచ్చు
నింపుగా కొండవీడు తా నేలవచ్చు,

అన్న—సరే! అటులే చెప్పెదను; కాని...మీరన్నయట్లు కార్యము విఫలమే

యయ్యో నా — నాకుఁబట్టిన యవస్థయే — యించుమించుగ వీరభద్రకునుఁ బట్టఁ గలదు. యిందు వింతయేమున్నది?

**కొండా** — అదేమి? నీకేమి యవస్థపట్టినది!

**అన్న** — బావా! నీవునన్ను పూర్ణముగ నిరాకరించితివి గాదా! ఇంతకన్న వస్థ యేమి కావలెను?

[8వ అనుబంధము]

**కొండా** — ఓహో! తెలిసినది. అన్నపూర్ణా! అహాహా హా! — నీవు మాటలయందు మంచి యుక్తిపరురాలవునుమా! కాని నన్నేమి చేయుమనియెదవు? నీ మంచిచెడ్డలు నీచేతిలోనే యున్నవి.

గీ. కోమలీ! నీవు — ననుఁబొందఁ గోరెదేని,
వీరభద్రను నాకు నర్పింపవలయు
నవల నినుఁగూడ నేఁబెండ్లి యాడువాఁడ
సతులు నాకిద్దఱూట దోషంబు గాదు

ఏమి! బాగున్నదా!

**అన్న** — బాగునకేమి గాని, యీ విషయమున నా మెన గీకరింపఁజేయుట ఫాలాక్షున కైన శక్యము గాదని నానమ్మకము.

**కొండా** — ఏమేమీ? - అంగీకరింపదా! ఫాలాక్షుఁడేల? తొందరపడకు - నేనే దాని నంగీకరింపఁ జేసెదను. తుదకు నాప్రాణము విసిగిన దానికన్నుల యెదుటనే దానితలిదండ్రులను ఖండించి పారవైచెదను. దానికన్నులయెదుటనే ఖడ్గనారాయణు నింతముక్కలక్రిందఁ గొట్టించివేసెదను. నన్నుఁ జేపట్టనియెడల తుట్ట తుదకు — దానికిఁగూడ పట్టినగతియే పట్టఁగలదని గట్టిగఁ జెప్పుము-పొమ్ము.

[9వ అనుబంధము]

[ఇరువురు చెరియొక వంక నిష్క్రమింతురు.)

## 4వ రంగము.

(రాచకొండ వీధి)

[మల్లినాథ ఖడ్గనారాయణులు ప్రవేశము]

**ఖడ్గ** — మిత్రమా! మల్లినాథా!

చ. పిలిచినవాఁడు నాకుతగు వీరముసైన నెవంగ లేదు. నా
వలుకులనైన పూర్ణముగఁ బల్కఁగనీ నింగ లేదు; ముగ్ధుడై
యలసభలోనఁ దెల్పఁదగునంచును నాయనపోతనాయఁడీ
చెలువుగ నన్ బరాభవముఁ జేసెఁగదా పిలిపించి మిత్రమా!

[నీల ప్రవేశించి ప్రక్కగా నిలుచును]

మల్లి—మిత్రమా! ఖడ్గనారాయణా! ఇందులకు సందేహమేమి? రెడ్లకును, వెలమవారికిని, తొలుతనుండియు—నన్యోన్య మహావైరానలంబు రగులుకొనుచుండిన వృత్తాంత మెవ్వరెఱుంగనిది అందును, యుక్తాయుక్త విచారణలేని భూపాలుఁడు గావున నట్లు వచించియుండును. వినను సభాదిన విశేషములంగూడ చూచితివి గాక! అనబోవు మిరుమ్ములుడుగ నేల?

ఖడ్గ—మల్లినాథా! నేను నాకు దుర్నిమిత్తములు పెక్కులు గల్గుచున్నవి. కార్యము శుభముగాఁ బరిణమించునని తోఁచదు.

మల్లి—అట్లయిన దానిఫలితమును, త్వరలో ననపోతనాయఁ డనుభవించును—మనకు విచారమేల!

ఖడ్గ—నాకొక్క విచారము మాత్రము గలదు—వినుమంటివా

గీ. తండ్రి కాఁగింపకుండ స్వాతంత్ర్యబుద్ధి
రాయబారంబు మనమిట్లు సేయుచుంట
కార్యవైఫల్యములకును, కదనములకు
గారణంబగునని పల్కఁగలఁడు తండ్రి

మల్లి—అయినను, మనమీ కార్యమును, రాజక్షేమమునకుఁ గోరకదా యొనరించుచుంటిమి.

ఖడ్గ—మల్లినాథా! ఆ ప్రక్కనొక బాలికామణి నిలువఁబడియున్నది చూడుము.

మల్లి—ఈమె యెవ్వతో తెలిసికొందము.

ఖడ్గ—అబలా? నీ వెవ్వతె?

నీల—నాతో మీకేమి యవసరమున్నది?

ఖడ్గ—అవసరమేమియును లేదు; కాని

ఆ. రాజతనయభాతి రాజిల్లు నీ వద
నాంబుజంబు; దాసినగుచు నిట్లు
కష్టపడుటకేమి కారణం బమ్మరో
భ్రాతరీతి నాకుఁ బలుకు మమ్మ.

నీల—అనఘా! తమరెవ్వరో నేనెఱుంగకపోయినను కేవల దయాపూరితములగు మీ పలుకులు నాదుఃఖము నుపశమింపఁజేసినవి. కాని, నాదీనచరిత్రము నాలకించి, మీ మృదు మానసముల గష్టపెట్టుట కిష్టములేకున్నది.

ఖడ్గ—సోదరీ! నీ వట్లనఁగూడదు నీచరిత్రమును నాలకించి నీవిపద్దశనుండి తప్పించుటకు నాచే నొంతిసేవ చేయించుకొమ్ము. అంతదనుక నాకు సంతృప్తి గలుగదు.

నీల—అయ్యా! అట్లయిన వినుడు.

సీ. వదములం బైకట్టి చాళుక్యరాజ వం
 శమునఁ బుట్టిన వీరజాతవయ్యా
పూజితం బైన యాభువన పర్వతదుర్గ
 సార్వభౌముండు నాజనకుఁడయ్యా!
ఖలుఁడనపోతని ఖడ్గధారకు నాదు
 జనకుండు సోదరుల్ వమసిరయ్యా
బలవంతముగ బల్లపల్లి యుద్ధంబున
 పరులు నన్ దాసిగా పట్టిరయ్యా
గీ. దీనురాలనై యేవంక దిక్కులేక
 కలిదోలంగిన నామనఃకమల మిప్పుడు
 తావక దయారసమున మోదమునఁ బండె
 ధీరవర! మీఋణంబునుఁ దీర్చుటెట్లు

[10వ అనుబంధము]

ఖడ్గ—హరిహరీ! ఎంతకష్ట మెంతకష్టము! సోదరీ! నీపేరేమి?

నీల—అయ్యా! నన్ను నీలయని పిలుతురు. ప్రతి సాయంకాలమును తిప్పరాజుగారి స్త్రీలనిమిత్తమై పూవులు గోసి యిచ్చుచుండవలయునని నాకు దేవిగారి యానతి. కావున నే నిప్పుడు మంత్రిగారియింటికి కరుగుచున్నాను.

ఖడ్గ—అబలా! నీవింత విపద్దశయందుండగా నేను నీకేమి యుపకారము చేయగలనో తోఁచుటలేదు. నీకుపకృతిగల్గు కార్యమేదని యొనరింపుమని నీవే నియోగించినచో నట్లొనరింప సర్వదా సంసిద్ధుడను.

నీల—ఆర్యా! నాదీనదశను తొలఁగింప మానవమాత్రులకు సాధ్యముకాదు. పరమేశ్వరుఁడే కటాక్షించి నాకీచెఱను తప్పించినయెడల వివాహముమాని కాశీక్షేత్రంబున జపముచేసికొనుచుఁ గాలము పుచ్చుదున్నాను.

[11వ అనుబంధము]

ఖడ్గ—సోదరీ! దుఃఖభరంబు నందకుము. నీవిచార మచిరకాలంబున శాంతమొందగలదు, నీవు నాస్మృతియందు మఱువఁబడకుందువుగాక!

[12వ అనుబంధము]

(అందఱు నిష్క్రమింతురు)

# ధరణికోట

## ద్వితీయాంకము

### 1వ రంగము.

(అనపోతనాయని దర్బారు)

(మంత్రిసామంతులు, ఖడ్గ. మల్లి,వీణా, కొండా మొదలగువారితో అనపోతనాయఁడు)

అందఱు — [13వ అనుబంధము]

అందఱు — (కరవాలములను ఒఱలఁగాఁజేర్చి మరల నొరలోనుంచి) జయ్! అనపోత రాజ దేవేంద్రునకు జయ్!

అన — సభ్యులారా! మిమ్మందఱను నేటి మధ్యాహ్నమున నీసభామందిరమునకు రప్పించుటకు — రెండు ప్రబలకారణములు గలవు. గాఁబోవు పూర్ణిమాదివసంబున, మనకందఱకును గౌరవనీయులును, మాతండ్రిగారును, కీర్తిశేషులును నగు సింగభూపతి మహారాజు గారి జన్మదిన మహోత్సవమును గావించుటకు మనమందర మీవఱకే నిశ్చయించుకొంటిమి.

సీ. బీదసాదల ఘోష వినరాదు; కనరాదు
కవులు సంతృప్తినిఁ గాంచవలయు
పౌర జానపదులు పర్వంబుగా నెంచి
యారాచకొండకుఁ జేరవలయు
ఉద్యోగులెల్ల సముత్సాహభరితులై
పర్వంబునకుఁ దోడు పడఁగవలయు
పురమెల్ల సౌందర్యపూరితంబగునట్లు
శ్రీకరంబుగ, గను సేయవలయు

గీ. భలువిరోధములూఁగి ప్రతివారు రాజమం
దిరము నెల్లమెడలఁ దిఱుఁగవచ్చు
ఉత్సవంబటంచు నూరూరఁ జాటించి
ప్రజలకెల్లఁ దెలియబఱుపవలయు.

ఈవిషయంబుల నెఱిఁగించుట నేటిదర్బారునకుఁగల కారణములలో - మొదటిది.

అందఱు — జయ్ — అనపోతరాజ దేవేంద్రునకు జయ్.

అన—ఇఁక రెండవ కారణము... తెలియఁజేసెదను. కొండవీటి వేమారెడ్డి వద్దనుండి, యేదో సందేశముం గొని... యిరువురు రాయబారులు వచ్చినారఁట! వారు ప్రస్తుతము—మన దర్బారునందే యున్నారు... వారు తెచ్చిన సందేశమును విని పిదపఁ గర్తవ్యాంశ మూహింపవచ్చును

ఖడ్గ—(లేచి) సభాధ్యక్షా! బహుళ మాతంగజేంద్ర స్యందన సేనాసహస్రాహతకటక రాష్ట్రాధిష్ఠ విద్విష్ట సంహర్త్రమాణ పరమదనోద్యదుగ్ర ధాటీభట శ్రీమహిత జయ విజృంభుఁడును—అర్థిప్రత్యర్థిదానసిత అపరిమిత భూదానపరశురామ అనేక నగరోపకంఠ ప్రతిపాదిత బహువిధారామ పాండ్యరాడ్గజసింహాద్యనేక బిరుదాంకితుండును నగు నన వేమ కొండవీటి ధాత్రీమండలాఖండలుండు మాచే బంపిన రాచకీయ సందేశమును విన్నవించుచున్నాము.

కొండా—ఓయీ! మాదర్బారునందు మాశత్రురాజుల బిరుదావళులు నీవుగ్గడింపక, తెచ్చిన సందేశమును మాత్రమే చెప్పవలయును.

ఖడ్గ—అలాగునా! వేమభూపాలుని ప్రసిద్ధ బిరుదావళి నిచ్చట నుగ్గడింపవంతమాత్రమున నాతని కేమియు లోటుగలుగదు. మార్తాండుఁ డుద్దండతేజశ్శాలి యని యొకరేల స్తుతింపవలెను!—కావున నింక నా సందేశము మాత్రమే వినుఁడు.

కొండా—లవథిక ప్రసంగము చేయక సాగా చెప్పు

ఖడ్గ... ఓ మహారాజా!

ఆ. కొండవీడు రాచకొండ దుర్గములకు
  గలుగు పూర్వవైర కారణమాని
  యుభయ రాజ్యములకు ను తమ లాభంబుఁ
  గలుగ జేయుదారి గాంచుడయ్య

అన—ఏమేమీ! అదిమాకు సరిగా బోధపడలేదు—మరియొకసారి చెప్పుము.

ఖడ్గ—ఇదిగో—చెప్పుచున్నాఁడను. నేటినుండియు రాచకొండ—కొండవీడులు స్నేహభావమున నుండవలయునని మాప్రభువు కోరిక.

అన—ఎందుచేత? ఈస్నేహము మీ మేలుకొఱకా? మా మేలుకొఱకా?

ఖడ్గ—ఉభయుల మేలుకొఱకు. అందు ముఖ్యముగ ఆంధ్రదేశము మేలుకొఱకు.

ఉ. కాకతిరాజ్య మంత్యదశఁ గాంచిననాఁటు గోలె నద్యశః
  ప్రాకటమైన యాంధ్రరమ భాసిలుచున్నది శామరాశపై
  బ్రాకిను కంకణంబువలె; భామినిరాజ్యము గర్భశూలమై
  పీక దలిర్చువేళ తగవే! మనలోన వివాదమూనుటల్.

చ. సదమలమైన యాంధ్రవిలసద్ధనీరుహమంత మందఁగా
  చెదపురుగైన మ్లేచ్ఛుల యశేషరమావిభవం బసాధ్యమై

చేతగాదేని యిపుడె నిశ్చింతఁబూని
వీరభద్రుపైని దురాశవీడరమ్మ!

అన్న—అమ్మా! ఇప్పుడు నీకట్లు దుఃఖింపక శౌర్యముదేర దానవుగమ్మ ధీరుఁడగు ఖడ్గనారాయణుఁ డెన్నడును, కష్టములకై—మనోధైర్యము చెడి ప్రాణత్యాగ మొనర్పువాఁడు గాడు. ఐనను—నేనొకయంత్రము లోపల నెట్లో కారాగృహమున కేగి, ప్రస్తుతమాయనకు ధైర్యము గఱపివచ్చెదను. నీవును నొక లేఖ వ్రాసియిమ్ము దానిఁ గొనిపోయి యాయనకిచ్చెదను.

వీర—చెలీ! అన్నపూర్ణా! నాకింతకన్న నేమికావలయును. అట్లే వ్రాసియిచ్చెదను. యిప్పుడే యారంభింతును.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

## 3వ రంగము.

రాచకొండ వీథిలో—

(వెంకన్న—అన్నపూర్ణ చెఱియొక వైపునుండి ప్రవేశము)

వెంక—ఓహో! అన్నపూర్ణా!—నేనెంత యదృష్టవంతుఁడనే! ఇంతకుముందు నామనస్సులో నిన్నుగూర్చియే—యాలోచించుచున్నానుసుమా నిజముగా నేను సంకల్పసిద్ధుఁడను—

అన్న—తాతా! నీవు సంకల్పసిద్ధుఁడవు శ్మశానసిద్ధుఁడవు—

వెంక—అదిగో! నన్ను తాతా, యని పిలువవలదని నీకెన్నిసారులు చెప్పినాను. నా గ్రహచారముకాలా—పట్టుకొని యింకను, నాకు పలువదియేండ్లునునిండలేదు. అప్పుడే తాతనైపోయినానా? నాదంతములు చూఁడుము. ఎంత పటుత్వముతో నున్నవో—నాకండలు చూఁడుము ఎట్లు తిరిగి యున్నవో—

అన్న—తాతా! వానిమాటకేమిగాని, నీ తలవెంట్రుకలకు—తారువ్రాసితివా యేమి? మొన్నటికన్నను—నేఁడు నల్లగానున్నవి

వెంక—అన్నపూర్ణా! తెల్లవారింగి మొదలు గిట్టని ముండకొడుకులందఱును నన్నిట్లే వేళాకోళము చేయుచుందురు నీవుగూడ వారిలోఁ జేరితివా? ఏదీ! నీ ముద్దుమొగ మొకసారి, పైకెత్తి—నాశరీరమును చక్కఁగాఁ జూడుము. నేనెంత యందగాఁడనో నీకే తెలిసికొనఁగలవు.

(17 వ అనుబంధము)

అన్న—నీయందము కానవచ్చియున్నది. నీ బ్రతుకునకుఁ జక్కఁదనమొకటి యుండవలెనుగా?

వెంక—అయ్యో! అట్లనియెదవేల? నీవంటిసుందరి నాకు భార్యగా నుండ, నాకుఁగాక మఱియెవ్వరికి చక్కఁదనము?

అన్న — ఛీ! నోరుముయ్యి — ఆ పేరులావన కట్టిపెట్టవలయునని నీకెన్నిమారులు చెప్పితిని.

(18 వ అనుబంధము)

వెంక — ఔను నేనేమిచేయఁగలను? నీవు సమ్మతించకున్న — బలవంతముగనైన - నెత్తుకొని పోయెదను గాని, యీవిషయములో నీవెంత చెప్పినను, నేను వినను.

అన్న — ఛీ! మూర్ఖుడా! నీకు సన్నిపాతము మంచినట్లున్నది గాని, నీనోరు మూతబడదు

వెంక — నాకు సన్నిపాతము, మంచినప్పుడు నీకేమనాఁడె? నీవెట్లు బ్రదుకఁగలవు? అన్నపూర్ణా! మానుగులో గుద్దులాట లెందుకు? స్పష్టముగా వినుము. నీమానస్సింకను మారకున్నది — రాత్రి భోజనమైన తరువాత, నీయింటికివచ్చి బోధపఱచెదను. అప్పుడు నీవు............

అన్న — నీవరువునకుఁ దోడు మాయింటికిగూడ రావలెనా? అట్టిపని యెప్పుడును చేయకు. కళ్ళు పెఱుకఁగొట్టఁగలను.

వెంక — ఆహా! అన్నపూర్ణా! నీవట్లు చేసినయెడల నిజముగా నాకు మహోపకారము సల్పినదాన వగుదువు. కాళ్ళు విఱిగి నేను నీయింటనే పడియున్నప్పుడు — నీవే వచ్చెత్తుకొని, మంచముపైఁద బరుండఁబెట్టుటయుఁ సంభవించును గదా! ఆహాహా! అప్పుడు నేనెంత యదృష్టవంతుఁడ నగుదును! — అట్టిభాగ్యమే — నీవు నాకుఁ గల్గించిన యెడల — నేను తప్పక నేటిరాత్రి — నీయింటికి వచ్చెదను. నీవు మాత్రమొక చేపాటికర్రతో గుమ్మమువద్ద సిద్ధముగా నుండుము.

అన్న — ఓరి సిగ్గుమాలిన శిఖండీ! నీకు వచ్చిన యీదెవ్వరికి వచ్చినదిరా ఛీ! నడు వీధిలో నవ్వులాటలా — నడు — నడు —

(19 వ అనుబంధము)

(ఇద్దరును — నిష్క్రమింతురు)

9 వ రంగము

[రాచకొండలోని చెఱసాల]

ఖడ్గ — (20 వ అనుబంధము)

వెంక — ఘోరాహుసార్! ఘోరాహుసార్!!

అన్న — (ప్రవేశించి) (తనలో) అల్లదే సుకుమారుండగు ఖడ్గనారాయణుఁడు కారాగృహవాసంబున [illegible] మయిన మహాదుఃఖమండలముతో దుఃఖించుచున్నవాఁడు. నేనీ మద్యము నీకారాగృహరక్షకున కొసంగి మత్తునిఁ జేసి, వీరభద్రయ్య యుత్తరము నీ ఖడ్గనారాయణున కొసంగెదఁ గాక! —

వెంక — నహ్వో! నహ్వో! రామచిలుక! బంగారుమొలక — నన్ను పెండ్లాడదాని కొన్నాళ్ళీ — రా — రా — మోహినీ — రా — నాకొక ముద్దిచ్చివెళ్లు.

ఖడ్గ—ఓరీ! తులువా! ఏమిరా ప్రతాపప్రదర్శనము చేయఁజూచుచున్నావు! రమ్ము—మన యుద్ధకౌశలము నేఁడె తెలియఁగలదు

(కత్తిలాగును)

కొండా—దుష్టా! వంటయింటఁజొచ్చిన కుందేలు వయిరి వెందుబోయెదవు? నీ పీచ మడంతును రమ్ము—

మల్లి—(కత్తిలాగి) ఓరీ! మందమాంచి—మొరుగుచున్న కుక్కవలె మొఱఁగిన నేమి లాభము? కులద్రోహివై—పూజ్యమగు రెడ్డికులంబునఁ బుట్టితివి—పొట్టకోసరము—రాచవారి నాశ్రయించి వంచన పడిన నీ నాశనమునకు ఖడ్గనారాయణుఁడు కావలయునా? రమ్ము నా కరవాలాగ్నియందు శలభంబవై మాడి పోయెదవు.

(14 వ అనుబంధము)

వీరా—రాజేంద్రా! ఏమి యీ కల్లోలము? రాయబారంబు నలుపవచ్చిన దూతపై కలహించుట మనకు నీతి గాదు

అన—కొండారెడ్డీ! శాంతింపుము. వీరి రాయబార మింక చాలును. వీరి నిప్పుడే పురము వెడలింపుము.

కొండా—మహారాజా! నాదొక మనవిగలదు. ఈ దుర్మార్గుఁడు మన రాజకీయ రహస్యములను—మన యుద్ధప్రయత్నములను—గాఢముగ కనుఁగొనుటకై—యీ రాయబారమను మిషచే మన పట్టణముఁ బ్రవేశించెను. ఈ నాలుగైదు దినములనుండియు నితఁడు పట్టణమునందంతటను సంచరించుచు—నేమేమో సంగతులు కనుఁగొనుచునే యుండెను. ప్రతిస్థలమునందును, ఈ మూర్ఖుఁడు దేవరవారినిఁ గూర్చి ప్రసంగించుచు; తమ రణప్రయోజకులనియుఁ, యుక్తాయుక్త విచక్షణ శూన్యులనియుఁ, సింహాసనమున కనర్హులనియుఁ దమ ప్రభువే విక్రమశాలి యోగ్యుఁడనియుఁ, నోటికివచ్చినట్లెల్ల దూషించినాఁడు. ఈ రాయబారులు మాయింట నేబసచేసియున్నందున, నిన్నటిరాత్రి రెండుజాములకు, మేడపైనున్న గదిలో—నిద్రలేకుండ కూర్చుండి వీరు మాటాడుకొనిన మాటలను నేను రహస్యముగ వింటిని. అప్పుడు నా గుండెలు పగిలిపోయినవి. వీరు సామాన్య రాయబారులు కారు. పట్టపగలె—బహిరంగముగ కన్నముఁ ద్రవ్వఁగల గజదొంగలు. వీరిని సామాన్యముగ విడిచిపెట్టరాదు.

మల్లి—(కత్తిదూసి) ఓరోరి యసత్యవాదీ! నిత్యపాతకవర్తీ! ఏమనుచుంటివిరా!

మ. తులువా! యేమనిపల్కితీవు? దురితాత్మా! వేనవేలింక నీ
బలగంబుల్గలరంచు నుత్తిలి, యసంభావ్యంబు లిట్లాడెదే!
ఖలుఁడా! నీ శిరమిప్పుడే తఱిగి రక్తస్నానముం జేతు నీ
స్థలమే ప్రేతతలంబు గావలయు; వంశద్రోహి! పాపాత్ముఁడా!

ఖడ్గ—(పట్టుకొని) మిత్రమా! తొందరపడకుము,

అన—కొండారెడ్డీ! నీ స్వామిభక్తికి సంతసించితిమి. ఇంక మాటాడక నీ మల్లినాథుని పురమునుండి వెడలఁగొట్టి ఖడ్గనారాయణుని పట్టి బంధింపుము.

ఖడ్గ—గుటునలారా! మమ్ము బంధింప మీతరమగునటరా! రండు—మిమ్మందఱను మేమిరువురమే భూతబలి యిచ్చెదము! (అందఱును యుద్ధము చేయుదురు. ఖడ్గనారాయణుని పలువురు బంధింతురు. తెర వ్రాలును.)

## 2 వ రంగము—వీరారెడ్డియిల్లు.

వీర—(15 వ అనుబంధము.)

అన్న—అమ్మా! వీరభద్రా! ఊరడిల్లుము.

వీర—అన్నపూర్ణా! నా మనోరథమును, నా శరీరమును, నా యౌవనమును నే నమ్మహనీయునకు ధారపోసితిని. ఎన్నికష్టములు సంభవించినను నాకాతఁడే హృదయప్రియుఁడు. అతఁడే నా దైవము. లోకమంతయు నాకాతనితోడనే యున్నది. ఆమంగళాకారుని చరణకైంకర్యము నాకు లభింపనినాఁడు, నే నీ తుచ్ఛలోకము నుండి తప్పక విముక్తి చెందెదను.

అన్న—అమ్మా! నీవు మహాపతివ్రతవు. నీవంటి సాధ్వీమణికి, సర్వేశ్వరుఁడట్టి ఘోరవిపత్తుఁ గల్గింపఁడు. ఆపత్సమయమున, ధైర్యము వహించుటయే కార్యమునకు శుభసూచకము. విషాదమగ్నవై — నిరంతరమునిట్లు — శుష్కించుచున్న యెడల కార్యసాధనోపాయమును, మనకెఱిఁగించువారెవ్వరున్నారు? నీవింక ధైర్యము వహించునెడల నేనోయొకమార్గ మాలోచించి వానిని బంధవిముక్తునొనర్చుటకు ప్రయత్నింపవచ్చును.

( 16 అనుబంధము. )

వీర—చెలీ! దాపఁనేల?

సీ. నాజీవమగు ఖడ్గనారాయణునివ్వజీవ
నములతో నాకుఁ గన్బరుపరమ్మ!
ఘోరమౌ—నీవిపత్కారణంబున ప్రాణ
ములను వీడునో యేమొ తెలుపరమ్మ!
అనఘాత్మ! నీదాసియగు వీరభద్ర నీ
పైఁ బెంగఁగొనెనంచు బలుకరమ్మ!
మహనీయవిముక్తికి మార్గంబుగలదేని,
జీవమిచ్చెదనంచుఁ జెప్పరమ్మ

గీ. కాంతునిడుములుతీరు మార్గంబు వెదకి
తెరవు నీకిదియంచు బోధింపరమ్మ!

మేము మరల వచ్చుచున్నాము. ఈనారి మీ ధరణికోటను మీకు కాపాడు కొన్న జాలను- ఎందులకీ పట్టిడంబములు.

గీ. భయముచే మిమ్ముఁగని నాతపాఁపోవ
పాండ్యరాజులుగా మదిభ్రమసినావొ
ప్రబల చాళుక్య రక్తతర్పణము లొసఁగు
క్షత్రియులుసుమ్ము వీగ శత్రుమదాంధ్య.

ఖడ్గ— ఔనౌను. రాచవారు పాండ్యరాజవీరు లెట్లగుదురు?— పాండ్యరాజులు— ఆంధ్రదేశ చక్రవర్తియగు కాకతిప్రతాపరుద్రదేవ సార్వభౌమునికూడ సంగ్రామరంగంబున నెదిరించిన వీరాగ్రేసరు —రాచవారన్ననో యుద్ధకళనుం బన్నెట్టిదో యెఱుంగని పసిబాలురగు చాళుక్యరాజకుమారులను ఖండించిన ప్రతాపవంతులు— అందుచే వీరు............

అన— ఓరోరిమూర్ఖా! వాచాటా! శాంతించిన కొలఁదియు నీ దుష్ప్రసంగము హెచ్చించు చున్నదే! ఇక్కటీనుండి ప్రాణములను దక్కించుకొనిపోవు యోగ్యత నీకు లేనట్లున్నది. నీరెడ్డి పౌరుషమంతయు నిప్పుడే చూపకుము.

ఖడ్గ— రాజా! రెడ్డిపౌరుషమును నీవును పరిహసింపవలెనా? రెడ్డివారు రాచవారి కన్నగుం దీసిపోరనుమా! యిటు వినుము.

సీ. వినత దుర్మదరాజ దమన ప్రవీణ భా
వితశూరు లీకొండవీటి రెడ్లు
ప్రబలక్షత్రియమత్త భద్ర మాతంగవి
పాటసింహులు కొండవీటి రెడ్లు
సామ్రాజ్య విశ్రామ చంచత్క్రియారంభ
విద్వేషులీ కొండవీటి రెడ్లు
నిర్వక్రవిక్రమా ఖర్వచమూనను
నిశ్చితధీరు లీకొండవీటి రెడ్లు

గీ. పాండ్యరాజులవలె నోడి పారఁటకును
మెతుకు దుర్గాధిపతివోలె హతమగుటకు
పిఱికివారలుగారు మీ పీచమణఁప
వెడలనున్నారిదే కొండవీటి రెడ్లు

కొండా— (కత్తిదీసి) ఓరీ! అతిక్రాంతమర్యాదా! నాసముక్షమునకే మా రాజేంద్రుని దూషించుచు మా నాశనమును సంకల్పించుచు టివెఁటరా! తులువా! చూఁడు నిన్నేమిచేసెదనో—

అన్న—(21 అనుబంధము) (సారాయినిచ్చును)
వెంక—(త్రాగి పడిపోవును)
అన్న—ఇదే మంచిసమయము. (తాళముతీసి) శ్రీఖడ్గనారాయణునకు జయమగుఁగాక!
ఖడ్గ—అన్నపూర్ణా! ఇదేమి సాహసము! ఇట కూర్చుండుము.
అన్న—ఆర్యా! సుకుమారులగు తమరిట్టి దుర్గంధపూరిత ప్రదేశముల వాసముచేయుటకే
సాహసించి నప్పుడు—నా యీ సాహస మొకలెక్కయా?
ఖడ్గ—అన్నపూర్ణా! నా కష్టములకేమి? మీ చెలి వీరభద్ర క్షేమముగ నున్నదా?
అన్న—ఆమె క్షేమము నామెచే వ్రాయఁబడిన, యీలేఖయే మీ కెఱిగింపఁగలదు
ఖడ్గ—అన్నపూర్ణా! వీరభద్ర నా కుత్తరము వ్రాసినదా? ఏది ఏ ?
అన్న—(ఇచ్చును)
ఖడ్గ—(విప్పి చదువుచున్నాఁడు)
"ప్రాణేశ్వరా!

ఉ. తిండికి నాశపుట్టదు; గతించెను నిద్రయు; దప్పి లేదు; నా
గుండె పతాలుమంచునుఁ బగల్కొని పోవుచునుండె నక్కటా
పండిన పొట్లపండువలెఁ బ్రాణమిటుల్ క్షణభంగురంబు; గా
నుండె-భవద్వియోగమున నో హృదయేశ్వర! యేమిచేయుదున్.

సీ. కొండవీటికి గాచకొండకీ శత్రుత్వ
మేకారణము లేక యేలగలిగె?
ఆరాజు నిను రాయబారిగా నియమించి
యీ లీల రిపుసీమ కేల పంపె?
మాతండ్రి నీకు సన్మానంబుఁ గావించి
నీకేల మా యింట నెలవొసంగె
అక్కటా! నినుఁ జూసినంతనే, నాయంత
రాత్మ నీయందేటి కైక్యమయ్యె
దిక్కుమాలిన దైవమా తెలుఁగు నిన్నుఁ
గారలో నేల చేర్చె నిష్కరుణమతిని
ప్రాణనాయక! నీ పదాబ్జములఁ గొలిచి
నిన్నుఁ దలపోసి ప్రాణముల్ నిలుపఁజాల—

శా. కొండారెడ్డి కశాన బల్మినసువుల్ గోల్పోవ సంసిద్ధనై
యుండగ నిన్నని మోహబద్ధనయి నే నూరంత పేరాశతో

పాడేక మత్కృతపు న్యాయంబు మనిలో భావించితి న్నాని; యి
ట్లుండేక మా కృతపు న్యాయంబు చెఱుఁగ లేదోయీ మనోవల్లభా!

మ. తనుఁ జేపట్టకయున్న నా ప్రభు కబద్ధంబంచు స్పష్టంబుగా
ననె నా మూర్ఖుఁడు; నిన్ను గూడ చెఱలో నంతంబు నొందింపఁగా
గనుచున్నాఁడు; విపత్సముద్రమున, మున్గంగా దటప్పించె; నే
మనుదానన్ - మనకేమి సాధనమొ నాథా! నీవె భావింపవే!

ఉ. ఆపదలందు ధైర్యము, మహాత్ముల లక్షణ మంచు చేతనే
పాపపు సాహసంబునకుఁ బాల్పడఁ బోక, భవత్ప్రభా బల
ప్రాపకమైన ధీరకృపాణము ప్రాణముగా ధరింపుమా
పైపని చూచుకొందము; కృపామయుఁ డీశ్వరుఁ డుండునే కదా!

ఉ. వడ్డికి వడ్డిఁ గట్టి తమ వైరులపైఁ బగఁ దీర్చుకొంటయే
దోర్దండనంబుఁగా దలఁచి, దోర్బలలీలలు వేఁడు దొడ్డపైఁ
బడ్డ, నెదిర్చి - విల్లుఁగల బాహు బలాఢ్యులు రెడ్డిరాజులా
రెడ్డి కొలంపు బిడ్డఁడవు, ధరించిన శస్త్రము రిత్తపోవునే?

క. చండాఖడ్గకళాపివి,
చండాలుఁడ ఖర్వగర్వసంపన్నుండా
కొండారెడ్డిని గ్రక్కున
ఖండింపుము; జాగు లేక, కంటంబడినన్.

శా. కారాగార విముక్తుఁ జేసి నిను నేకష్టంబు లేకుండ మీ
యూరం జేర్పఁగ నెన్నొ మార్గములనే నూహించుచున్నాను; నీ
వైరుల్ నన్నుఁగ నాత్మహత్య కెపుడుం బాల్గాంతు మీకోసమై
కారుణ్యాలయుఁ డీశ్వరుండె మనలం గాపాడు; ప్రాణేశ్వరా!

ఇట్లు — నీ చరణసేవకురాలు
వీరభద్రి"

అన్న — దేవా! మా చెలి సంతాపాతిశయము నీ లేఖయే మీకు విశదము చేయఁగలదు.

ఖడ్గ — (వీరభద్రి నుద్దేశించి) వీరభద్రా! నిన్ను వీక్షించినదాది, నీ యనన్యసామాన్య
రూపలావణ్యాతిశయమునకే — యుప్పొంగుచుంటిని గాని, యింత పతిభావంబు

రాలవని, నేనెఱుంగనుసుమా! కార్యాలోచనమునందును, సూక్ష్మగ్రహణశక్తి యందును, నీవప్రతిమ ప్రజ్ఞావతివని నీవు వ్రాసిన యీయుత్తరము వేనోళ్లఁ జాటుచున్నది. మనోహారిణీ! ఏమందువు?

“.........విపత్సముద్రమున న,మ్మున్గంగాఁ బటసించె నేమనుగాక మనకేమి సాధనమో — నాథా నీవె బోధింపవె” అనియా? సుందరీ! ఏమి సాధనమున్నది? దైవమే మనకిఁక సాధనము. ఆశ్రితజన వత్సలుండగు, సర్వేశ్వరుఁడు నిరపరాధుల దండింపఁడు. నీచులచే దండింపఁబడనీయఁడు. అందుచేఁ బరమేశ్వర చరణస్మరణమే మనకిప్పుడు శరణము.

> “కొండారెడ్డిని గ్రక్కున
> ఖండింపుము; జంకు లేక కంటంబడినన్.’’

సులోదరీ! ఖడ్గనారాయణుఁ డిప్పుడు ఖడ్గహీనుఁడై యున్నాడు. లేనిచో — చండాలుఁడగు కొండారెడ్డి యింతకాలము ప్రాణముతో నుండునా? అధీర చిత్తుఁడు ప్రాణభయముచే — నాకరవాలము నూడఁబెఱికి, నిరాయుధుఁ జేయుటచేతనే వాఁడు చిరాయువై యున్నవాఁడు.

> “......వైరుల్ నవ్వఁగ నాత్మహత్య కెపుడున్
> బాల్గొనమీలోపలన్
> గారుణ్యాలయుఁ డీశ్వరుండె మనలన్
> గాపాడు, ప్రాణేశ్వరా !’’

సుందరీ! నీవు నాకపరిచితవగుటచే నాసంగతి నొక్కింతయు నెఱుంగక యిట్లు వ్రాసితివి. ఐననేమి? ఇమ్మందభాగ్యునియందు నీకుద్భవించిన మోహాతిశయమే నీచే నిట్లువ్రాయించినది. కాని పౌరుషప్రధానులగు రెడ్డివీరుల నిర్వక్ర విక్రమాతిశయములు నీ వెఱుంగనివికావు. ఇప్పుడేకాదు దివాకర నిశాకర తారకా గణములున్నంతవరకు — రెడ్డివీరులకుఁ బుట్టిన మొద్దుబిడ్డఁడు ముక్కున నూపిరి యుండుదనుక — సంగ్రామరంగంబున నెట్టి శాత్రవుఁడైన నెదిరించి నిల్చును గాని పిఱికిపందవలె నాత్మహత్యకుఁ బాల్పడునా? ఇంకఁ గొండారెడ్డి గాని — వానిప్రభువగు ననపోతనాయఁడు గాని నన్నేమి చేయఁగలరు? ఇల్లెంతకాల మీచెఱలో నుంచెదరు? అనీచులు కేవలము పౌరుషహీనులగుటచేతనే బహిరంగముగ రణరంగమున నన్నెదిరింపలేక — నిరాయుధు నొనర్చి యిట్లు బంధించినారు. కావుననే వలలోఁజిక్కి — మహోగ్రహసముదగ్రమగు నీరెడ్డిసింగము తన్ను చుట్టిచరించు శత్రుమదవేదండంబులఁ గన్నాఱఁ గాంచియు నూరకుండ వలసి వచ్చెను.

అన్న—ఆర్యా! ఈ త్తరమంతయు సావకాశముగఁ బరిశీలించినారా? మీరీవిషయమును గుర్చి యెంత దీర్ఘముగా నాలోచించుచున్నారు.

ఖడ్గ—అన్నపూర్ణా! మీ యజమానురాలు నా కీయుత్తరము నేల వ్రాసినది?

అన్న—ఆర్యా! ఈ త్తరమంతయుఁ జూచియు మీ రిట్లడిగిన నే నేమనఁగలను? ఆ యుత్తరము మీకు బోధపడినదా?

ఖడ్గ—ఈ త్తరము నాకు బోధపడినది, గాని నేనన్నమాట—నీకు బోధపడలేదు. నా హృదయమును మఱింత కలతఁబెట్టుటకు వీరభద్రి, యీ యుత్తరమేల వ్రాయవలయునని యడుగుచున్నాను

అన్న—ఆలాగుననా! మీ హృదయమును గలఁత పెట్టవలయునని, యామె యనుకొనలేదు. మీకు మనశ్శాంతి యగునని యెంచి—యీజాబు వ్రాసినది.

ఖడ్గ—అన్నపూర్ణా! అటులైనయెడల నా యపరాధమును క్షమియింపుము. నేనుతప్పుదలంచితిని. నిశ్చయముగ—నీయుత్తరము నా సంతాపమును ద్విగుణమొనర్చినది. మొదటే—దీర్ఘవిచారమున మునిఁగియుండిన వీరభద్రికి, నేను మఱింత సంతాపమును గలిగించుచున్నాను. మందభాగ్యుఁడనగు నాయందింత యనురాగమును వహించుట వలన నామె కేమి ప్రయోజనమున్నది?

అన్న—ఏమో—నాకేమి తెలియును? ఇంతకు నీశ్వరేచ్ఛ యెటులున్నదో కదా!

ఖడ్గ—పోనిమ్ము, అన్నపూర్ణా! నావిషయమై వీరభద్రి ఏమి యేర్పాటు చేయుచున్నది. నన్నిందుండి యెట్లు తప్పింపఁగలదు?

అన్న—ఇప్పటి కేమియు స్ఫురింపకున్నది. ఐనను—కొన్ని దినములలో—సింగభూపతి జన్మదినోత్సవము జరుగనున్నది గదా!

ఖడ్గ—జన్మదినోత్సవమా! అన్నపూర్ణా! ఈయుత్సవమును మీరాజు మిక్కిలి వేడుకగా జరిగించును గాఁబోలును.

అన్న—ఔను. ఆనాడు పట్టణమంతయు సంపూర్ణోత్సాహముతో నుండును. దూరదేశములనుండి సైత మెందఱో—యీ యుత్సవము చూచుటకు వచ్చుచుందురు.

ఖడ్గ—ఆహా! అన్నపూర్ణా! నీ వీ మాటలు చెప్పుచుండ నెందుచేతనో నాకుడికన్నదరుచున్నది. ఈశ్వరుఁడు మన వీరభద్రి ప్రయత్నమును కొనసాగించును గాఁబోలును,

అన్న—ఆర్యా! ఈశ్వరానుగ్రహమున, నిట్లే జరుగుఁగాక!

ఖడ్గ—అన్నపూర్ణా! ఈయుత్తరమునకుఁ బ్రత్యుత్తరముగా వీరభద్రకేమి చెప్పవలయునో తోఁచకున్నది అందుచే, నామెకు నానమస్కారములను మాత్ర మెఱిఁగింపుము.

అన్న—అయ్యో! పిన్నలకు పెద్దలు నమస్కరింపవచ్చునా?

ఖడ్గ—పోనిమ్మా—నేను నిరంతరముగా నామెకు చరణదాసుఁడనని చెప్పుము.

అన్న—అట్లు చెప్పినచో—నామె మనస్సున నొచ్చుకొనక మానదు.

ఖడ్గ—ఆలాగునా? సరే! ఆమె సుందరవదనారవిందమును నే నొకసారి ముద్దుపెట్టుకొంటినని చెప్పుము.

అన్న—అట్లే చెప్పెదను గాని, అందువలన మీ ధైర్యస్థైర్యము లామెకు తెలియఁగలవు. మఱియుఁ బురుషులు మోహాతురులని యామెకు స్పష్టమగును.

ఖడ్గ—అదియును వలదా! కానిమ్మా. నీవు వ్రాసినప్రకారము నీయాజ్ఞ శిరసావహించి యాత్మహత్యకుఁ బాల్పడక—నేను ధైర్యముతో నుండెదనని చెప్పుము.

అన్న—చెప్పెదను. గాని యిందువలన, మీ యుత్తమ నాయకత్వమును వీరభద్రి యాక్షేపించిన యెడల నేనుమాత్రము ఉత్తరవాదిని గాఁజాలను.

ఖడ్గ—అబ్బ—అన్నపూర్ణా! నీతో మాటాడుట కష్టముసుమా! నీవేమియుఁ జెప్ప నక్కఱలేదు. ఈముద్దుటుంగరమును—గైకొని యామెకుఁ బ్రత్యుత్తరముగా నర్పించితి ననుము. (ఇచ్చును)

అన్న—సెబాస్! అదిగదా వీరపురుషుల లక్షణము. దూరార్థ బోధకమగు ప్రత్యుత్తర మింతకన్న వేఱేమున్నది. ఆర్యా! నాకింక సెలవిప్పించెదరా?

ఖడ్గ—శుభంబగుగాక! పోయిరమ్మా.

(అన్న—నిష్క్రి—తెరవ్రాలును)

## 5వ రంగము.

పురవీధి

[వెంకన్న ఒంటరిగ ప్రవేశించును]

వెంక—(అనుబంధము 22)

మొన్న మొన్ననే అఱువై యేళ్ళుదాటి పదేళ్ళు పయినబడ్డవిగదా? నాకిప్పుడే యేమంత ముసలితన మొచ్చిందని తాతనౌతాను! అసలు—'తాత' అనే మాట కర్థమేమిటి? మనమళ్ళూ మనమరాళ్ళూ వుంటేగదా తాతనిగావడం—నాకింకా పెళ్ళేకాందే! ఇంతలో తాతనౌతానా? పరిహాసాలాడి పారిపోవడమేగాని వొక్కముండా కట్టుమని పెళ్ళాడమనఁడుగదా! వీళ్ళకేం పోయేకాలమోగాని

వెండితీగల్లాగ వెంట్రికలు మెరుస్తూవుంటే—అందము తక్కువట! నల్లగా మసిబొగ్గుల్లాగావుంటే నాణ్యమట! మొన్న అన్నపూర్ణ, యీదారిని వెళుతూ- కాస్త నామీద కన్నువేసింది, కాని మళ్ళీ కనపడ్డదిగాదు. ఎవరు చెపుమా! ఈదారిని రింగురింగుమంటూ వస్తున్నారు- అన్నపూర్ణ కాదుగదా! ఐనా— వీళ్ళంతా అన్నట్టుగానే- నాకు, దృష్టిలోవున్నమాట వాస్తవమే- (సరిగా చూచి) ఆ! ఈసారి చూపు బాగా అనతూంది. ఇది ఉద్యానపుదాసి మాలి. బాగుంది. పోనీ అన్నపూర్ణమాట మరిచిపోతాను. ఇదైనా-కనికరిస్తుందేమో-

(మాలి ప్రవేశము)

మాలి—వెంకన్న తాతా! ఎక్కడికో వెళుతున్నావూ?

వెంక—ఓసీ చెడిపెముండా! అన్నావూ! ఆమాటకాస్తా అనేశావంటే- నీకళ్ళకు- నే నెంతలో తాతనైపోయినానే?

మాలి—తాతా! నిన్ను తాతా అంటే అంతకోపమెందుకూ?

వెంక—అదుగదుగో! మళ్లీ తాతా అంటున్నావు? నావొళ్ళు మండుకుపోతుంది.

మాలి—మరి నిన్నేమని పిలవమన్నావు?

వెంక—ముద్దుగా బావా అని పిలవరాదంటే!

మాలి—ఓరినీముద్దుముక్కలుగానూ సరేకాని, బావా! ఇప్పుడెక్కడికి వెళుతున్నావో చెప్పావుకావుగదా!

వెంక—సెబాసే మరదలా; ఇప్పుడు బాగుంది. నీనోటినుంచి మంచిముత్యాలు రాలినట్టుంది. ఐతే నే నెక్కడికి వెళుతున్నానో-చెప్పమంటావా? చెపుతావిను- రేపు—మన ప్రభువుగారైన! అనపోతరాజుగారి తండ్రి జన్మదినోత్సవమని తెలియునా?

మాలి—వూరంతా—యింతశృంగారంగా—అలంకరిస్తూంటేగా—అంతమాత్రమైనా తెలుసుకోలేనా?

వెంక—ఈవుత్సవంరోజున గలిగిన ఆనందమువల్ల—ఇప్పటికి, ఖైదులో వున్నవాళ్ళందరిని రేపు రాజుగారు విడుదల చేయడానికి నిశ్చయించుకున్నారు. కొండవీటి యువరాజైన శ్రీగిరినారాయణుణ్ని కూడా వదలివేయుమని చెప్పడానికి ఫరమానా తీసుకొని వెళుతున్నాను. ఐతే—సరేగాని, మాలీ! నామాటేం చెప్పావు?

మాలి—నీమాటేమిటి?

వెంక—ఓసీ! తెలివితక్కువదానా! "బావా" అని నీచేత పిలిపించుకొని, నేను "మరదలా" అని పిలిచిందెందుకనుకున్నావు?-నిన్ను నేను పెళ్ళాడతా.

మాలి—వద్దు—వద్దు. ఐతే- ఆనరవ మానికేయి నన్ను "అత్తా" అని పిలుస్తావుండు. నిన్ను నేను- అల్లుడా అని పిలుస్తాను. నాకు బిడ్డపుడితే నీకిస్తాలే—

వెంక—అప్పటికి నేను చస్తే?

మాలి—చస్తే-తగలేస్తాను.

వెంక—ఓసీ! దిక్కుమాలినదానా! నేను చావవలెనఁటే?

(తెరలో)

మ. అరరే! యెంతటిమోసమయ్యో! ఖలుఁడో నా ఖడ్గనారాయణుం
డిరవొందం జెఱసాలనుండి చనునే? స్వేచ్ఛానుమోదాత్ముఁడై
గురుమంత్రంబు రచించి. కార్యఫల భగ్నంజేసి-మర్దింతు-నే
నరు, డోర్వంగలవాఁడు? వైరియగు, కొండారెడ్డి జీవింపఁగన్.

మాలి—(భయముతో) అమ్మయ్యో!-అదియేమి గంభీరనాదము?

వెంక—అదిగో! కత్తిమాసికొని, యార్చుచు దుష్టుఁడగు కొండారెడ్డి యిట్లే వచ్చుచున్నాఁడు. రమ్మ రమ్మ ప్రాణములు రక్షించుకొందము.

(మాలి నెత్తుకొని పరుగెత్తును.)

—o—

## 6వ రంగము.

(మందిరాంతర్భాగము.)

[క్రోధముతో, కొండారెడ్డి పూర్వోక్తపద్యముం జదువుచు ప్రవేశం]

కొండా—ఎంతదుర్మార్గుఁడు! ఎంత కుతంత్రపరాయణుఁడు! ఈ రహస్యము నాకు దెలియకుండినయెడల నాకస్మికముగ, నాకొంప మునిగిపోవునుగదా! నా ప్రయత్నము లన్నియును, గంగలో కలసిపోవునుగదా! తాను స్వయముగ, మనవిచేసిన యెడల, గౌర్యము లేదని తలంచి, మా మామ-ఛీఛీ! వాఁడు నా కెక్కడి మామ? ఆవీరారెడ్డి, యెవరిచేతనో యీసంగతి రాజునకుఁ జెప్పించి యుండును. ఐనను—ఎవరిచేఁ జెప్పించియుండును? ఉత్సవమునాఁడు కారాగృహమునం దున్న ఖైదీల నందఱను—విడుదల చేయుట రాజధర్మమని, ప్రధానమంత్రుల లో నే—యొకఁడో యొకఁడు— చెప్పవలసియుండును. కాని, వారందఱును—ఖడ్గనారాయణుని యందు మితిలేని కోపము వహించియున్నారుగదా! అట్లు

చెప్పియుందురా! కాదుకాదు—ఎంతమాత్రము నిది వారిబోధనకాదు. కాక మరియొకరిది.........ఇట్టి రాజకీయాంశము లితరోద్యోగస్థు లెవరును బోధించినను రాజు వినడుగదా! నిన్న సాయంకాలమున గోల్యకూటములో రాజుగారి యెదుట జరిగిన యుత్సవప్రసంగములో ఖయిదీల విషయమై ప్రశంసయె రాలేదు. మరియు- నిన్న రాత్రినుండియు రాజు దేవిగారి యంతఃపురమునందే యున్నట్లు వినుచున్నాను. పరపురుషులు చొరరాని యంతఃపురిసీమకేగి యీవిషయమై రాజున కెవరు బోధించెదరు? రేపుత్సవదినమగుటచే- ఖయిదీలనందరిని విడిచిపెట్టవలయునని- యింత యాకస్మికముగ నుత్తరవిచ్చుట కేమి కారణము? ఈ బుద్ధి రాజునకు స్వయముగఁ బుట్టినదా? లేక బలవంతముగ నితరులు పుట్టించిరా! స్వయముగాఁ బుట్టిన బుద్ధియే యైనచో ఖడ్గనారాయణుయం దింత యాగ్రహముతోనున్న యాతఁడు వానినిఁ దప్ప- తక్కిన ఖయిదీలను మాత్రము విడిచిపెట్టవలయున నాజ్ఞాపించి యుండడా? అందుచే నిది తప్పక పరబోధితమే కాని స్వయంకృతాపరాధము కాదు. కాని యీ బోధించినవా రెవరో-కుతంత్రములందు నాకన్నను నేర్పరులై కనఁబడుచున్నారు... .........కారణమేమియో తెలియరాదు. కాని నేటికి రెండుదినముల నుండి కోటలోని చాళుక్యరాజకన్యక యగు నీలయనుదాసి మాయింటికివచ్చి- వీరభద్రాన్నపూర్ణలతో నేమేమో గుసగుసలాడి పోవుచుండుట- నేను కనిపెట్టుచున్నాను. ఆగుసగుస లేవిషయమునుఁ గూర్చియో కదా! ఇదివఱకెప్పుడును ఆమె మాయింటికి వచ్చు నాచారము లేదే!...ఓహో! తెలిసినది. తెలిసినది! అబ్బా! ఎంతవ్యూహమును బన్నిరి! నేను మిక్కిలి మేధావంతుఁడ నగుటచే గ్రహించితిని గాని మరియొక మందబుద్ధి యయినచో నూరకుండవలసినదే కదా! ఈకుట్రలో నొక్క వీరారెడ్డియే కాక, వీరభద్రాన్నపూర్ణలు కూడ నున్నారు ఈ ముగ్గురునుఁ గలిసి యోచించి నీలను రప్పించి యామెకీ విషయమును బోధించి యుందురు. ఆయుపాయము ననుసరించి- నీల తనతోఁగూడ చాళుక్యదాసీలందఱితోడ నీ సంగతి నొక్క చెప్పియుందురు, వారందరునుఁ గలసి పట్టపుదేవికీ సంగతి తలకెక్కించి యుందురు. ఆ చెప్పుటలో ఖైదీల నుత్సవసమయమున విడిచిపెట్టుట రాజధర్మమనియు--తమతండ్రులు రాజ్యమేలు సమయములో నటులే విడిచిపెట్టుచుండిరనియు—నుత్సాహదినములో ఖైదీలమంగళకరముగ రోదనము చేయుట రాజునకు శ్రేయస్కరము కాదనియు—రాణికి మనస్సు నొప్పికల్గునటుల చెప్పియుందురు. తోడనే యామెకర్త విషయమున మిక్కిలి బలవంతపఱచి యుండును. ఓహో! ఎంత కపటాటోపము! ఎంత నిగూఢప్రయత్నము! ఖడ్గనారాయణుని చెఱలోనుండి స్వేచ్ఛగా విడిచిపెట్టిన యెడల నా మాయలమారి ముండకొడుకు వీరభద్రను నాకు దక్కనిచ్చునా? ఇంతటి కుట్రలం బన్న నేర్చిన యన్నపూర్ణయు వీరారెడ్డియు వీరభద్రను వాని వెంటఁ బంపివేయకుందురా? అందుచే- నాకిప్పుడు కర్తవ్యమేమి?

రాజునకు బోధఁజేసి వానిమనస్సు త్రిప్పి—యీయుత్తరువు రద్దుచేయింపఁ బ్రయత్నించుట కవకాశము లేశమును లేదు తెల్లవారినచో- ఖైదీలను విడువక తప్పదు. కావున నింకొక్కటియే కర్తవ్యము! ఇట్టిపట్టున సాహసము వహించినఁగాని కార్యము కొనసాగ నేరదు. సెబాస్! ఖడ్గనారాయణా! నిన్ను గూర్చి యెంతయు ప్రయత్నించినను గార్యము లేకపోయినది. నీ యాశ లడుగంటుచున్నవి. నీజీవితకాల పరిమితియును నీరాత్రిమాత్రము నీవు వృథా ప్రచ్ఛక రామనామస్మరణ చేసికొనుచుండుము.

(2వ అనుబంధము.)

(నిష్క్రమించుదురు)

—o—

(7వ రంగము.)

(సింగభూపతి యాలయము.)

(సింగభూపతి విగ్రహమున కెదురుగా అనపోత మాధవనాయకులు పూజించుచుందురు)

అన— సోదరా మాధవా! ఇది మన జనకుని జన్మగిన మగటిచేత పితృప్రతిమానమగు నీ విగ్రహమునకుఁ బూజాభిషేకములు చేయుట మనకుఁ గర్తవ్యము. వీరులను దైవసమానముగా బూజించుట భారతజాతికి గర్తవ్యమై యున్నది.

చ. దివమున కేగియున్న జగతీవరుఁడౌ జనకుండు సుప్రమో
ద వహుఁడు గాఁగ పౌరులు ముదంబున వేడుకలన్మ్రొనంగ శ్రీ
భవమగు భారతావనికి బంధురకీర్తి జెలంగఁ జేసి నే
డవిరళ భక్తియుక్తి ననుజా! సలుపందగు వీరపూజలన్.

అందరు— జయ్! శ్రీ సింగభూపతికి జయ్!

(తెరలో మంటలు)

(వాకిలఁ బెజులో కోలాహలము.)

ఓహో!— పౌరజానపదులారా! స్వామిభక్తి పరాయణులారా! లెండు- లెండు. మన కొంపలు మునిగిపోయినవి. మన పట్టణము పరశురామప్రీతి యగుచున్నది. ఉపద్రవము! గొప్ప యుపద్రవము- త్వరపడుఁడు. పురమంతయుఁ గాలుచున్నది. ఈ వృత్తాంతమును మహారాజున కెఱింగింపుఁడు.

అందరు— (భీతిల్లుచున్నారు.)

[మరలఁ దెరలో]

ఉ. ఓరిదురాత్ములార! వినుఁడో యవనీపతులార యే దెసం
బారెద రిప్డు దీప్తర మహోగ్ర భయానక కీలికీలమా
లారుణదీప్తి భస్మమగు నంత్యము దాపురమయ్యె నేటితో
కోరియొనర్చు పాపములకుం దగు నిష్కృతిగల్గు నేటితోన్

అన—మిత్రులారా! ఎవ్వని యుపాలంభ వాక్యములివి? ఏ నృశంసునకీ యానంద దృశ్యమునకుఁ గన్నులు మండెను? ఏ శాత్రవుండు మన పురంబును భస్మీపటల మొనరింప సమకట్టెను? అద్భుతముగా నున్నదే!

(తెరలో మరల కోలాహలము.)

మాధ—సోదరా! ఇప్పుడీ మాటలతోఁ గాలయాపనము చేయుట కిది సమయము లేదు. నేను పరిజన సమూహముతోఁ బరి యీ యుపద్రవ మణంగు వెటవ్యూహించెదను. పరిజనులారా! లెండు ఆలసింపకుఁడు. మీరందరును మాతండ్రితాతల నాటినుండియు మమ్ముఁగొలిచి మీ కుటుంబములతో సుఖముగా వర్ధిల్లుచున్నారు. సకల విభవోపేతమగు నిప్పురంబింతకాల ముపద్రవరహితముగ విరాజిల్లెను. మీ స్వామి విశ్వాసము నీ తరుణమునఁ జూపకున్న నేమిఫలము?

అందరు—(24 వ అనుబంధము)

(మాధవనాయఁడు పరివారముతో, నిష్క్రమించును)

అన—కటకటా! ఎట్టిపుర రాజమున కెట్టిగతి పట్టినది! అత్యున్నత గగనచుంబిత సౌధాగ్రము, లనలాహుతులందు మండి క్రిందికి దిగజారి మసియైపోవుచున్నవి. ఆహా! నాకన్నులీ దారుణమును గాంచి సహింపకున్నవి.

సీ. అంబరోన్నత సుధా హర్మ్యవితానంబు
లనలభీషణదీప్తి నంత మొందె-
సుందరప్రముదిత శుద్ధాంతభాగంబు,
లగ్నికీలలలోన సణఁగిపోయె-
శాత్రవ దుర్భేద్య జటిలప్రసత్ప్రాకార
రాజియంతయు భస్మరాసియయ్యె
మించినవేడ్క నిర్మించినట్టి, సదలం
కారంబులన్నియుఁ గాలిపోయె-

గీ. కడుపులోనిచల్ల కదలకపదిల్లు
పరిజల కెట్టి దుఃఖభారము య్యె
రాజితానమాన రాచకొండపురంబు
నేడు కాలి, కూలి, పాడువడియె.

ఇయ్యది-ప్రమాదజనితముగాదు, శత్రుజనకృతమగు మహాపకారము! కానిచో-నేకకాలంబున, పురమంతయు, భగ్గున మండిపోవఁగలదా! ఎవ్వరో- దురాత్ములిట్లొనర్చిరి. ఎవ్వడో యని సంశయగ్రస్తుండను కానేల? నాకుఁ దోలుత మండియు, గర్భశాత్రవులగు రెడ్లే -యింతపని చేసియుందురు. సంశయములేదు- ఓరోరి దుష్టులారా! రెడ్డిపాతకులారా!

ఉ. పాతకులార! మాపుర మపారము, గాల్చుట పౌరుషంబె? మ
చ్ఛాత కృపాణధారలను, జావకయుందురె దుష్టులార! దు
ర్నీతిని, చోరవైఖరి నరిందమ దుష్కృతి సేయఁ బూనినా
రా! తలలూడ్తు నిప్పుడు పరాక్రమువైఖరి రండు శూరులై.

(ఛద్మవేషములతో * మల్లినాథుఁడు, భిల్లులు, కాగడాలుపూని ప్రవేశము.)

మల్లి—ఓరోరి మదాంధా! గర్వపోతా అనపోతా! నీ తండ్రి జన్మదినోత్సవ మేటుజరుగుచున్నదో యూచితివా? ఇది లంకాదహనము. నీ దురహ్యమునకు దోడ్పడుటకై యీహరికథలు-భజనలు-సానిమేళములు-చాలవని మేమీనాటకమునుఁ బ్రదర్శించుచున్నాము. ఛీ దురాత్మా! నీకీ శిక్ష చాలదు మున్ముందు నిన్నింతకన్నను-మోసపుచ్చను న్నారము జాగ్రత్తగాఁ గాచుకొమ్ము పొమ్ము.

అన—ఛీ! దుష్టులారా! ఇదియా మీపౌరుషము అఁడువాండ్రవలె—నధమరీతి, పురదహనము చేయుటయా శౌర్యము.

మల్లి—ఓరి కుటిలాత్ముఁడా? నిరపరాధియగు—ఖడ్గనారాయణుపి- రాయబారియుని తలంపక చెఱనిడుట పౌరుషమటరా! కుక్కకాటునకు చెప్పదెబ్బయేగదా యౌషధము.

అన—పోరికి! నీవెవ్వఁడవో-- నన్నుఁ జూడనిమ్ము.

(బలవంతముగ ముసుగుదీయఁబోగా అందఱును అనపోతనాయని నణఁచిపట్టుదురు.)

* కన్నులుదప్ప మిగత మొగమునకు గుడ్డలు కట్టుకొనుట.

మల్లి — విషహృదయుఁడా! నీవింక బ్రతుకఁగూడదు. నిన్ను చంపి - యాంధ్రరాజ్యమును నిష్కంటకముగా జేసెదను. (చంపబోవును)

(కృష్ణరాజు ఛద్మవేషముతో ప్రవేశము)

కృ — (మల్లి॥ని పట్టుకొని) మిత్రమా! ఇదియేమిపని? ఇది మన భవిష్యత్కార్యమునకెంత యంతరాయము? పోనిమ్ము — ఈ దుష్టునితో మనకేల? ఈ సింగభూపతి విగ్రహమును భిన్నముచేసి యీ మందిరమునకు సయిత మగ్ని తగిల్చి పోవుదము. (అందరు నట్లుచేసి నిష్క్రమింతురు. తెరలో మంటలు)

(అనపోత నాయఁడు వెఱగంది చూచుచుండును.)

25 వ అనుబంధము. (తెరవ్రాలును)

# ధరణికోట

## రెడ్డివీరుల సంగ్రామకథ

## తృతీయాంకము.

### 1 వ రంగము

(నీలగృహముయెదుట కృష్ణరాజు మల్లినాథుఁడు భిల్లులు)

అందఱు—[నీలను పట్టి యీడ్తురు]

(26 వ అనుబంధము)

కృ—ఖడ్గనారాయణుం డెక్కడనున్నాఁడో చెప్పెదవా లేదా? చెప్పివేసినయెడల, నీకే యపాయమును లేకుండ విడిచిపెట్టెదను. చెప్పనియెడల నీగృహమును ముట్టించి మీ కందఱకును సంఘమరణమును గూర్చెదము.

నీల—అయ్యా! నన్నేల మీ రకారణముగ బాధించెదరు? నాకు ఖడ్గనారాయణుని వృత్తాంత మేమియుఁ దెలియదు. కరుణించి నన్ను వదలుఁడు.

కృ—ఓసీ! గయ్యాళీ! అంత గట్టిగ నెందుల కఱచెదవు! నోరుమూయుము. నే మడిగిన సంగతి చెప్పకున్నచో నిన్నిప్పుడే ఖండించెదను.

నీల—అయ్యా! క్షమింపుము. దిక్కులేనిదానను. అనాథను. రాజకీయ వ్యవహారములు రహస్యములు. నాకెట్లు తెలియఁగలవు? నిష్కారణముగ స్త్రీహత్య నొనర్పకుఁడు. నే నేపాప మెరుంగను.

కృ—పోనిమ్ము- నీభర్త యెచ్చటనున్నాఁడు? వానికీ వృత్తాంతము తెలియునా? ఈరహస్య మెఱింగినవారీ చుట్టుపట్ల నెవ్వరైన నున్నారా?

నీల—అయ్యా! నాకింకను వివాహముకాలేదు. నేను, కోటలోని నిరుపేదదాసిని.

కృ—ఛీ! ఛీ! దురాత్మురాలా! భర్తకపాయమురాకుండ బెండ్లికాలేదని, మా యెడ బొంకుచున్నావా? ఇది యబద్ధమైనచో—నిన్నేమి చేసెదనో చూడుము (ఒకభిల్లుని జూచి) ఓరి! భిల్లుఁడా! ఆకాగడా నిటు దెమ్ము. దీనిమొగము చూచెదను. (అందుకొని చూచి స్వగతము) భళిరే ఏమియీమందయాన సౌందర్యము! నాహృదయము నాకర్షించి, వశము గావించుకొని, దయారస సంకలితముగఁ గావించెనే! కానిమ్ము- మాటలాడించెదను. (ప్రకాశముగ) అబలా! నీవెవ్వరు? నిశ్చయముగ, నొకదాసివేనా? ఖడ్గనారాయణుని వృత్తాంతము నీ వెరుఁగనే యెఱుఁగవా?

నీల—అయ్యా! ప్రస్తుతము నేనొక దాసినే. నే నెవ్వతెనైననేమి? నన్నుఁ బంప నెంచినవారికి, నాచరిత్రముతో, నేమిపని యున్నది? ఖడ్గనారాయణుఁడు నా కాప్తుఁడు—

కృ—ఆప్తుఁడనగా? ఆతనిని నీవు వరించితివా?

నీల—శ్రీరామరామ-పాపము శాంతించుఁగాక ఆ మహనీయుఁడు, నన్ను దనసోదరిగా మన్నించెను. ఈ పట్టణమున బ్రవేశించినప్పటినుండియు, వాని చరిత్రము నే నెఱుంగుదును. కష్టదశలో నున్నప్పుడు......

కృ—సుందరీ! ఇఁక చాలింపుము. నీ వెవ్వతో తెలియక, మేమొనర్చిన యపరాధములను క్షమించి నామాట వినుము—వీరందఱిఁ జూచి—నీవింక భయపడ నవసరము లేదు. నీవు నిజముగ—మా ఖడ్గనారాయణుని కాప్తురాల వైనచో—నీవలనఁ గొన్ని సంగతులు మాకుఁ దెలియవలసి యున్నవి. నీకభ్యంతరము లేనిచో—నేను లోపలికి వచ్చి—నీతో రహస్యముగ మాటాడెదను. లోపలికి రమ్మా.

నీల—చిత్తము.

(ఇరువురు నిష్క్రమింతురు)

1పరి—నారాయణ—నారాయణ—అర్ధరాత్రివేళ, ఆఁడుదానితో సంభాషణ—నిప్పులేకుండ కొంపలంటుకొనునా యేమిరా?

2పరి—ఆవిడ కన్యక—ఆయన పెండ్లిగానివాఁడు. అంటుకొనుటలో ననుమాన ముండునా?

మంత్రి—ఓయీ! ధర్మచింతనుఁడగు మా కృష్ణరాజును మీరట్లు తలంపఁగూడదు. రాచకీయము నే భాషించుచుండ నొప్పు—

(కృష్ణరాజు ప్రవేశము)

కృ—మిత్రులారా! వింటిరా! కొండారెడ్డి దురాగతము. ఈ కుటిలకర్ముఁడు మన ఖడ్గనారాయణునిఁ బట్టి కట్టుకొని పోయి—భువనగిరిగండి ప్రాంతమున వధింప నీరాత్రి సముద్యోగించె నని చాళుక్య రాజకన్యకయగు నీ నీల చెప్పినది. మన మిఁక నేమాత్ర మాలసించినను కార్యచ్ఛేద మగును. కావున నిఁక లెండు కొండారెడ్డిని ఖండించి ఖడ్గనారాయణుని రక్షింతము.

(అందరు నిష్క్రమింతురు.)

## (2 వ రంగము)

(కొండపై మూర్ఛిల్లిన ఖడ్గనారాయణుడును కొండారెడ్డియు వెంకన్న మొదలగువారు ప్రవేశింతురు)

వెంక — అయ్యా! కొండారెడ్డి గారూ! మీరింత యాలస్యము చేసినచో జరుగవలసిన కార్యము లెట్లు జరుగును? ఎంతసేపని యీ శవ జాగరణము మేము చేయుచుండగలము?

కొండా — వెంకన్నా! ముందువెనుక లాలోచింపవలయును గాని నీ వట్లు కోపము దెచ్చుకొనుట న్యాయమేనా? మనము చేయుచున్న కార్యమతి రహస్యమైనది. ఇతరులకు దెలిసినయెడల మనకెట్టి యాపదయైన రాకమానదు. తగిన సమయము దొరుకవలయుననియే నే నింతవరకు వేచియుంటిని గాని లేనిచో నేటి మధ్యాహ్నమునందే వీనిని దుదముట్టించియుందును.

వెంక — సరేకాని యిప్పుడే వచ్చెదనని చెప్పి మీరింతసేపు నెక్కడనున్నారు?

కొండా — మన మొనర్పబోవు కార్యమునకు ముందుగా నొకమారు కొండ నలుదిక్కుల బరీక్షించుట మంచిదని నేను బయలుదేరినంతనే — కుడివైపున బర్వతము క్రిందనున్న చెట్లచాటునుండి మనుష్యుల యడుగుల చప్పుడు నాకు వినబడినట్లయినది. అది నిజమో యబద్ధమో కనుగొనవలయునని కొంతసేపు నిరీక్షించితిని. కాని నాకా యనుమానము మాత్ర మిప్పటికిని దీరలేదు. ఎవరో — మనుష్యులీ చుట్టుప్రక్కల నున్నట్లు నామనస్సు సంకోచించుచున్నది.

వెంక — రెడ్డి గారూ! మీకు మతిపోయిన దేమి? ఇంత రాత్రివేళ నీ పర్వత ప్రాంతమున జనసంచార మెట్లుండగలదు? గాలిచే కదలిన యాకుల చప్పుడో — గుంటనక్కల పరుగుల చప్పుడో! మీకు వృథాసందేహము గాని నిరీక్షించి పట్టుకొని మనలను పట్టియిచ్చు శత్రువు లెవ్వరున్నారు? ఇట్టి వట్టి సంశయములతో గాలము వ్యర్థపుచ్చినచో — ముందేమి ముప్పు రాగలదో?

కొండా — వెంకన్నా! నీవు వయస్సునందే కాక బుద్ధియందుకూడ మిక్కిలి పెద్దవాడవు. నేడు నీవు నాకొనరించిన మహోపకారము నే నెన్నటికిని మరువజాలను. నీవు చెప్పినట్లు నేనీ వృథాసంశయముల నిక విడిచి కర్తవ్యము నారంభించుట మంచిది. (ఖడ్గనారాయణుని తన్ని లేపి) ఓరీ! మదాంధా! ఖడ్గనారాయణా! వీరభద్రుని పెండ్లి కాడను సంకల్పము నిన్నింకను విడువలేదు గాబోలును! పాపము నీ యాశలన్నియు నడుగంటినవి. ఇంక వీరభద్రనామస్మరణ చేసికొనుము. నీజీవితశేషమింక కొలది నిముసములు మాత్రమే యున్నది.

ఖడ్గ—(లేచి) ఛీ! దురాత్మా! సిగ్గులేక- పౌరుషవంతునివలె నే మొగముతో మాట్లాడుచున్నావురా! నన్ను నిరాయుధుఁ జేసి నా కరచరణములను బంధించి బలవంతముగ చంపుటకు నీకేల చిన్నతనము గలుగలేదు? నీ పౌరుషమంతయు నెంగలోఁ గలిసిపోయినది! మీసములుగల మగవాఁడవైనచో-వీరాగ్రేసరుఁడవైనచో- నా బంధములు విప్పి—నన్నాయుధపాణిఁ జేసి - నా యెదుట నిలిచి - పోరుఁడుము- ఒక్క- నీవే కాదు ఇచ్చటనున్న వారందఱు నన్నుఁ దేరఁగడ వచ్చును. అంతియేకాని ఛీ! పిరికిపందా! ఇదియా నీ పౌరుషము! నీ వాసనే ప్రాణములన్న నాకంత తీపి యనుకొంటివా? ఈ ప్రాణము నాకు లక్ష్యమే లేదు. కాని సంగ్రామ రంగంబున వీరాగ్రేసరులతో-హోరాహోరిగాఁ బోరాడి వీరస్వర్గము నొందకుండ గడు నీచుఁడవగు నీయెదుట ప్రాణములు విడువవలసి వచ్చినందులకు విచారించుచున్నాను. ఓరీ! చండాలుఁడా! నీపై నిష్టము లేని కన్యను నశింపఁ బ్రదా మోహమునఁ జిక్కి - యెంత యెంత క్రూరకృత్యము లాచరింపఁ బాల్పడితివి మితిమీరితివిచోఁ గడకు ప్రాణత్యాగమైనఁ జేసికొనును గాని వేయిజన్మములు తపమ్ము చేసినను వీరభద్రి నన్నుఁ గన్నెత్తియైనఁ జూచునా? నేను బ్రతికియున్నను చనిపోయినను నామాటయే నీకు ప్రమాణముగుఁ గాక. ఇంక నీయిష్టము వచ్చినట్లు చేసికొనుము.

కొండా—ఓరీ! పోగరుబోతా! నిస్సహాయుఁడ వయినను నీకెంత తెగసాగుచున్నదిరా! ఇంక నిన్ను క్షమింపరాదు—పాదములంబడి ప్రార్థింపవలసిన ఈసమయమున నింత గా చెలరేగుదువు—బ్రతుకఁగూడదురా! దుష్టా! ఇంక నీకులదేవతను ప్రార్థించుకొనుము.

ఖడ్గ—ఓరీ! దుష్టా! అనాథశరణ్యుఁడగు ఈశ్వరుఁడే నన్ను రక్షింపఁ గలఁడురా!

[ధ్యానించును]

(27వ అనుబంధము.)

కొండా—ఇంకేమి చూచెదవు? నీతాత యెవ్వఁడడ్డమువచ్చునో—నీవి నీ కొండపై నుండి క్రిందికి బడద్రోయుదును—అట్లే శాశ్వత విశ్రాంతి నందుదువు గాక.

[అంతటను ఖడ్గనారాయణుని క్రిందికి ద్రోయ యత్నించును. కృష్ణరాజు మల్లినాథుఁడు భిల్లులువచ్చి అందఱను తుపాకులు చూపుదురు—కొండారెడ్డి తుపాకిదెబ్బతిని పారిపోవును-మిగతివారు ఖడ్గనారాయణుని వదలిపోవుదురు]

తెర దిగును.

[గాయములకు కట్టుగట్టుకొని కొండారెడ్డి ప్రవేశము]

కొండా—(28వ అనుబంధము)

నుదుటి గాయమునకు వేయిరెట్లు-హృదయమందలి గాయము బాధించుచున్నది.

ఇట్టి నాకా శాంతి? ఖడ్గనారాయణ ప్రజ్వలితమగు విరోధదావానలము శల్యా శల్య సంధిబంధము లందును నిబిడీకృతముగ నిండి సలుపుచుండఁగా నాకెక్కడి శాంతి? వీని వైర మనుక్షణమును నా కధిక మగుచున్నదే! ఈ గాయముంజూచి యనపోతనాయఁ డేమిగా భావించునో! దీనిని కప్పుకొను నుపాయాంతర మేది?_ఊఁ!- ఏల కప్పుకొనఁ బ్రయత్నింపవలెను. ఈ యపరాధమును ఖడ్గనారాయణ పరిభృత్యుల పైననే రుద్దదఁ గాక!- మేనమామ యని నమ్మియున్న నన్నింత పరాభవదుఃఖములపాలు గావించిన వీరారెడ్డి దుస్థితిం గాంచి కొవ్వునకేరి నవ్వినఁగదా నాదుఃఖ మించుకంతైన శాంతించునట! క్రిందటిరేయి జరిగిన పుర దహనమునందలి కుట్రకంతటికిని మూలకారణము వీరారెడ్డియే యని రాజును నమ్మింపలేక పోవుదునా? ఇది యెంతటి కార్యము! నేడు రాజు సభ గావించునని వింటిని. ఆసభయందు నాచమత్కారముతంతయుఁ జూపెదఁ గాక!— (నిష్క్రమించును)

## (4వ రంగము.)

అనపోతనాయని దర్బారు.

(ప్రి॥ అన॥ కొండా॥ సభ్యులు ఆసనములపై)

అన—రెడ్డీ!- మీ మామగారేల రాలేదు? కొలువుకూటమునకు, దయచేయుటకు వారికి, తీరుబడి లేకయున్నదా యేమి? నేడు సభ జరుగవలసి యున్నదని వారికి మేము వర్తమాన మంపితిమే! అది వారి కంపలేదు కాబోలును! మరల కబురంపుము.

కొండా—చిత్తము. ఏలిక నాకే యాజ్ఞాపించితిరి. సభకు రావలసియుండునని నేను వారికి స్పష్టముగా నెఱిఁగించితిని.

అన—సరే! అట్లయినయెడల నేమిచేత రాలేదు?

కొండా—అతని శరీర మస్వస్థముగా నున్నదఁట! గతరాత్రి నిద్రలేదఁట!

అన—ఔను—నిన్న రాత్రి పట్టణములో నెవరికిమాత్రము నిద్రయున్నది,

కొం—చిత్తము నేనాసంగతి కూడ చెప్పితిని కాని యాతఁడు పెదవివిఱచి—ఈ సభ కెక్కడికి వచ్చెదనులే- రాజునకు ఏమియుఁదోఁచనప్పుడు, కాలక్షేపమునకై యిట్టిసభలు తఱుచుగా జరుగుచుండవలసినదే కదా! ఇప్పుడిట్లు—నాసంగతి నీకేంగను? అని యసూయతో, నతఁడు నాకు బ్రత్యుత్తర మిచ్చెను. మహారాజా! ఇంతకన్నను అతనిని నిర్బంధించుటకు నాకధికారము లేదుగదా!

అన__(కోపముతో) ఏమేమీ! వీరారెడ్డి కప్పుడే_యింతవరకు కన్నులు నెత్తికెక్కెనా? అతఁ డేమి మామకొని మాయెడల నింత నిర్భయత్వము వహించెనో__అకారణముగఁ బట్టణమంతయు నిట్లు దహింపఁబడియుండ నిలుచుటకు నీడ లేక పౌరులెల్లరు చింతాక్రాంతులై యుండ రాజునగు నేనుసయితము ఘోరమగు నీ వైపరీత్యమునుఁ జూచి__నిద్రాహారములు లేక విచారించుచుండ, వాఁడు హాయిగా నింటిలోఁ బరుండి యున్నాఁడా? రాత్రి వానికొంప దహింపఁ బడలేదు కాఁబోలును సరే!__అట్లైనచో__వానికేల మనము ప్రయాసముఁ గలిగింప వలయును? అట్లే పరుండి యుండవచ్చును. మరల మా యాజ్ఞ యగువరకు రాజగృహద్వారమును దాఁటిరా వీలులేదు మా యాజ్ఞగా వాని కెఱిఁగింపుము. ముందుముందు వానిసంగతి విచారింతము.

కొం__మహాప్రభూ! అతఁడు కేవలమును స్వజాత్యభిమానధనుఁడు. ఖడ్గనారాయణుని విషయమునఁ దనయభిప్రాయమున కెలినవారు విరోధులుగా నొచ్చి నప్పటి నుండియు వానికీ యుద్యోగమునం దసహ్యము కలిగియుండెను. ఏగుప్తమై నకారణముచేతనో కాని, మూఁడు నాలుగు దినములనుండియు నాతఁడీ పట్టణమును విడిచిపోవలయునని మిక్కిలి పట్టుదలతోఁ బనిచేయుచున్నాఁడు.

అన__అలాగునా! వాని కంతయుత్సాహ మున్నదను సంగతి నేనెఱుంగను. నాకు తెలిసి యున్నయెడల వాని మనోభీష్ట మీపాటికే నెరవేర్చి యుందును. ఈ సంగతు లన్నియు విచారించిచూడ నిన్నరాత్రి జరిగిన మహోపద్రవమునకు సంబంధించినవారిలో వీరారెడ్డికూడ నొకఁడై యుండవచ్చునని నా కనుమానముగా నున్నది.

కొం__మహాప్రభూ! తమరు వినవలసిన సంగతు లింకననేకము లున్నవి. ఖడ్గనారాయణునియందు, వీరారెడ్డికింత యభిమానముండుటకు గారణమును తమ రెఱుంగరు. తన కుమార్తెయయిన వీరభద్రను ధరణికోట యువరాజగు సుబోత్తారెడ్డి పెండ్లి యాడునట్లు చేసెదనని యామూరుఁడు వాగ్దానము చేసినందువలన రెడ్డిగారికి వానియం దింత యభిమాన ముదయించినది. కాని రెండునాలుకలుగల ఖడ్గనారాయణుఁడు వానితో నట్లుచెప్పి వీరభద్ర నెట్లైన తానే దక్కించుకొన వలయునని లోలోపల రహస్యముగాఁ బ్రయత్నింప నారంభించెను. మొదటి నుండియు, తన కుమార్తెను నాకే యిచ్చెదనని వీరారెడ్డి నాతోఁ జెప్పుచుండుటచే నేను గొంపెడాశ వహించి యుంటిని గాని యీ ఖడ్గనారాయణుఁడు వచ్చిననాటనుండియును నాయాశ అంతరించినది.

అన__ఇంతేకద! కొండారెడ్డీ! నీ వీ విషయమున భీతిపడక యుండుము. వీరభద్రను నీకిప్పించి మేము దివాణముననే పెండ్లి చేయించెదము.

కొండా__దేవా! దేవరవారి యభిమానమునకు వేయినమస్కారములు. తన కుమార్తెను నాకీయక పోయినను నాకుఁ గోపములేదు గాని యాతఁడు రాజద్రోహి యగు

టనే నేను మామయుని గౌరవింపక శత్రువుం జూచినట్లు చూచుచున్నాను. ఈ యాంతరంగిక సంబంధము లన్నియును నేను బాగుగ నెఱింగియుండుటచేతనే— ఆనాఁడు మల్లినాథునిఁగాని ఖడ్గనారాయణునిఁగాని విడిచిపెట్టవలదని నేను తమతో నంతమొఱపెట్టుటకుఁ గారణమైనది. కాని నాపాపముచే నప్పుడేలినవారు నాయందు విశ్వాసముంపరైతిరి.

అన—రెడ్డీ! ఈవిషయములో నేను దూరమాలోచింపకపోవుట పొరపాటే—ఈ సంగతులన్నియు—నాకప్పుడు తెలిసియుండిన యెడల వారినట్లు విడిచిపెట్టి యుండను. అయిన నాసంగతి ఇప్పు డెందులకు? మల్లినాథుని విడిచిపెట్టుట నిన్నటి యుపద్రవమునకుఁ గారణమేమో యనియా నీ యభిప్రాయము!

కొండా—మహాప్రభూ! కంటితో స్పష్టముగాఁ జూచుచుండ ననుమాన మనుమాట యెందుకు? ఏలినవారు క్షమించినయెడల నేను గొన్నిప్రశ్నలు వేసెదను. ఆనాటి కొలువుకూటములో దేవరవారు రాయబారులను రప్పించి వారితో బ్రసంగించుటకు ముందు సభ్యులతో నుత్సవ ప్రసంగము చేసి యా ప్రసంగమున నెఱుఁగపలసిన యేర్పాటులను చెప్పివేసితిరా లేదా! ఆరహస్యముల నప్పుఁటిని రాయబారు లాలకించిరిగాదా! కావున శత్రువులయెదుట మనరహస్యములను వెల్లడించుట మొదటితప్పు. అందొకని చెఱలోనుంచి రెండవవానిని విడిచిపెట్టుట రెండవతప్పు—మహాప్రభూ! క్షమింపుఁడు. ఈ యుపద్రవమునకెల్ల కారకుఁడు మల్లినాథుఁడే. దైవవశమున బ్రతికితినిగాని—నిన్న రాత్రి—యా మల్లినాథపిశాచమునకుఁ జిక్కి నేను ప్రాణములఁ గోలుపోవలసినదే!

అన—ఏమేమీ! మల్లినాథుఁడా! మల్లినాథుఁడేనా? నీవు చూచితివా! చెప్పు—చెప్పు—ఏమి జఱిగినదో చెప్పు

కొం—రాజేంద్రా! ఏమని మనవిచేయఁగలను! నిన్నరాత్రి భోజనమైన పిదప నుత్సవములోనికి బయలుదేర వలెనని, దుస్తులు ధరించుకొని వీధిలోనికి వచ్చుసరికి, మల్లినాథుఁడును వీరారెడ్డియును, ముసుగులు వేసుకొని, యరుగుపైఁ గూర్చుండి యేమేమో గుసగుస లాడుకొనుచుండిరి. అందు, "పరశురామప్రీతి—"అను మాట నాచెవినిఁ బడినది. తరువాత, మల్లినాథుఁడు బయలుదేరి, మఱియొక వీధిలోనికిఁ బోయి, యొక నూఱుమందిగల గుంపుతోఁ గలసికొనెను. నేనును, వెంటనంటి పోయినంతనే, యాగుంపు నాపైఁబడి, నా కపాలము బ్రద్దలగునట్లు పగులఁగొట్టిరి. ఇందు, మీ కేమైన ననుమానమున్నచో, నా శిరముపైనున్న గాయమును చూడవచ్చును. (తలకట్టుఁదీసి చూపును.)

అన—(కోపముతో కత్తిలాగి) ఓయీ కొండారెడ్డీ! నీవు, మా కాప్తబాంధవుడవు! ఆ మదాంధుఁడు ఆ క్రూరచిత్తుఁడు ఆ రాజద్రోహి—యగు వీరారెడ్డి, యిఁక

ప్రాణములతో నుండఁడు. వాఁడే కాదు. వాని కుటుంబ మంతయు, రేపు నా కన్నులయెదుట నింతింత, ముక్కలుగా ఖండింపఁ బడవలెను. ఇదిగో! ఈఖడ్గము చూడుము. ఇయ్యది—పితృవాక్య పరిపాలనా పరిపూర్తియందు, నాకుఁ దోడ్పడి, సింగభూపతికి గర్భశత్రువులగు, చాళుక్య రాజపుత్రుల కంఠముల నరఁటిచెట్లు కరణి ఖండించి—తపశ్శక్తిధారల చేత—పితృతర్పణములు చేయించి చాళుక్యుల పాలిటి పరశురాముఁడనని నాకు పౌరుష బిరుదమిప్పించి, నన్నుద్ధరించి—ప్రసిద్ధికెక్కిన మహాయుధరాజము!—దీనిని, నీకు బహుమానముగా నిచ్చుచున్నాను. నీవు మాపు—అత్తియను సభిమానము నుంచుకొనక రేపు రేపకడనే జాము పొద్దెక్కులోపల పౌరులయెదుట వీరారెడ్డి కుటుంబమును ఖండించి పారవేయుము వాని కిదే శిక్ష.

## (29వ అనుబంధము.)

[తెరవ్రాలును.]

# ధరణికోట

—— రెడ్డివీరుల సంగ్రామకథ ——

## చతుర్థాంకము

### 1వ రంగము.

(కొండవీటిలో అనవేమారెడ్డి సభ)

[పరివేషము అనవేమారెడ్డి ఖడ్గనారాయణుఁడు ఎఱ్ఱాప్రగడ కొందఱు సభ్యులును]

ఖడ్గ—(అనవేమారెడ్డి పాదములకడ మోకరించి చేతులు జోడించి)

(30వ అనుబంధము)

అన-వే—నీవు నా యెదుట నింక నిధికప్రస్తాపనము చేయకుము. నీవు నాకుమారుఁడవు గావు నేను నీకు తండ్రిని గాను. ఓరి కులనాశకా! ఎంత తెలివితక్కువపని చేసితివిరా! రెడ్డికులమున కంతకును తీఱని కళంకముఁ దెచ్చితివి గదరా! .. మల్లినాథా! నీవు చెప్పినదంతయు మిగుల నద్భుతముగా నున్నది. ఎట్లో వీరిరువురును బ్రతికివచ్చినందులకు మేము సంతసించుచున్నాము. కాని నన్నడుగకుండ నా సెలవు గైకొనకుండ మాఱుపేరును, మాఱువేషమును, ధరించి—ఈ యువరాజు రాయబారిగా నెట్లు బయలుదేఱెనో—తెలియకున్నది.

**చ పసుచుఁ దనంపు గర్వమున భావి గతిం బరికింపఁ బోక నో**
**వెడఁగ! విరోధిచేతఁ జెఱఁబెట్టఁగఁ బడ్డ దురాత్ము నోటితోఁ**
**గొనుకని పిల్చుకొంటె నిఁక గూర్చెడు దుర్యశమేది? రెడ్డివం**
**గడమున నిన్నుఁ బోలు నఘకర్ముఁడు పుట్టెనె? కీర్తి నెట్టెనే?**

అదృష్టవశమున కృష్ణరాజు భిల్లసేనలతో వచ్చి రక్షింపకుండిన నీగతియేమి? ముందు రాజ్యమునకు రావలసిన వాఁడవే? ఇదియా నీవిజ్ఞానము.

ఖడ్గ—(వినయముతో) తండ్రీ! నేనాచరించినది కడుఁగడు నవిచార్యమగు కార్యమని నేనెఱుంగుదును. ఐనను—రాజభక్తి హైన్యమున నేనటాచరింపలేదు. అది తమకు దుర్యశోపాదకమగు కార్యముగాఁ బరిణమించినచో నేనే దానిఁ దీర్చుకోఁగల వాఁడను. నా యీ ప్రథమాపరాధమును క్షమింపుఁడు.

వాఁడుగాదు. నేటినుండియును వీని ఖడ్గనారాయణ బిరుదము సంఘటితము చేసి వేయ బడినదని యెల్లరు నెఱుంగుదురు గాక! శత్రువులు మన రాయబారులను హింసించిరి. ఇది మనకుఁ బరాభవము కావున నా మాటలను సావధానముగ వినుఁడు

**చ. శతఘ్నులు గాచ లోహధరణీకోట నెదుర్కొనఁ జూచుచుండి, శ్రీ**
**సహాయము నందు శాముసము, సల్పిన మోసమున్ సిద్ధమైనాను; మీ**
**రమల మనీషులార! సమరాంగణ శౌర్యము సల్పినంత లె**
**స్స్రిమఁ గొని మీదు పూర్వుల యశంబులు రెట్టిలఁగాఁ గెల్వుఁడీ**

అందఱు—(కత్తులు ధ్వనింపఁ జేయుచు) రెడ్డిరాజ సార్వభౌమునకు జయ్!

అన_వే—మఱియొక మాట. సేనానాయకుఁ డొకఁడును వివిధ బలంబులను సిద్ధము చేసుకొని ధరణికోట కరుగవలయును. అన్నారెడ్డియు మల్లారెడ్డియు శ్రోత్రియ యువరాజును వెంటనిడుకొని నేఁడే ధరణికోటకు బయలుదేఱి యుద్ధము చేయ వలసిన సన్నాహములన్నియుఁ జేసి - సిద్ధముగ నుండవలెను మల్లినాథా! అనవరత సైన్యముఁడు ఖిల్ల సేనలతో మనకుఁ దోడుగ నుండుమని కృష్ణరాజుతోఁ జెప్పుము.

[అందఱు కత్తులెత్తి] రెడ్డిరాజ సార్వభౌమునకు జయ్!

అన_వే—వీరాగ్రేసరులారా? యుద్ధకాముక విచక్షణులైన శూన్యులై మన రాయబారిని బట్టి కారాగృహమునఁ బెట్టిన దుర్మార్గులకు, ప్రతిఫలముగా సనపోతనాయనిఁ బట్టి చెఱలోఁ బెట్టఁగల సామర్థ్యముగల వీరుఁ డెవ్వఁడైన నీసభామధ్యమునఁ గల్గినచో నీ బంగారు కంకణమును సహస్త్రసాధితమగు నీ కనక ఖడ్గమును వచ్చును. ఈకార్యమునకొక్క ఖడ్గనారాయణునకు మాత్రమధికారము లేదు. (కంకణము నుంచును.)

మల్లి—మహారాజా! ఇదియేమి న్యాయము! ఖడ్గనారాయణునకే యధికారము లేనిచో నింకెవఁడు మదోన్మత్తుఁడగు సనపోతనాయని బంధింప సమర్థులు గలరు? మా యాశలన్నియు నాతనిపైననే కదా యున్నది యువరాజ్యపట్టము లేకున్నను రెడ్డిసామ్రాజ్యపు గౌరవాగౌరవము లాతని చేతనే కదా నిలచియున్నది.

ఎఱ్ఱా—రాజేంద్రా! ఇట్టి యాటంకము నను వదించి నీ రాకకంకణము నిప్పుడు నుంచినను నుంచకున్నను ఒక్కటియే_ఖడ్గనారాయణునకు సంఘటిత మింక నధికార మీయనిచో నీ కంకణము నీ సభలో నెవ్వరు ముట్టరు.

అన_వే—సరే_మీరందఱు నింతగా చెప్పుచున్నారు గావున, వారికిఁ గూడ నధికార మిచ్చితిని.

ఖడ్గ—[ముందునకువచ్చి] ఓ సభ్యులారా! తండ్రీ! వేమభూపాలకా!— కాదు కాదు_ఇట్టి నేను నీ కుమారుఁడను గానుండఁ దగనని సెలవిచ్చితిరి గావున_మహారాజా!

నాలో నాకే నవ్వు తెప్పించుచున్నది. విక్రమరాజుట!—విక్రమరాజు! ! ఎక్కడ నున్నదా విక్రమము ! లోగుట్టు పరమేశ్వరున కెఱుక ! వేష మందముగనే, యమరినది, గాని — మగతనమెట్టు నెక్కడినుండి తేగలను ? ఈ వేషముతో నీ వ్యూహము కడతేరెనా ధన్యురాలనే. నా మిత్రురాలగు నన్నపూర్ణ హితోపదేశము చేత వీరభద్రా ఖడ్గనారాయణుల కేమైన నుపకారము చేయగలిగనే కదా ధన్యురాలను.....................అదిగో! ఎవ్వరో యీ వంకకు వచ్చుచున్నారు. నేను కొంచెము ధైర్యముగ నిలువ బడవలెను.

(వెంకన్న ప్రవేశము)

వెంక—ఓహో!! ఎవతిది?—మొగముచేడి—మగదుస్తులు—ఏదో మాయవేషముగా నున్నదే! (తేరి పారజూచుచున్నాడు.)

విక్రి—తాతా! ఏమట్లు బహునిదానముగా చూచుచున్నావు?

వెంక—హాత్తేరీ కొంటెసన్నాసీ! నీకు గూడా పుట్టెనే తెగులూ—ఏమి? నీకళ్ళకు గూడా నేను తాతలా గున్నానా! ఈపడుచు గిత్తల కెం తెగులురా బాబూ కొంచెం గడ్డం నెరిస్తే సరియట—తాత! నేను వీళ్ళేబాబుల్ని కన్నానా?

విక్రి—కోప్పడబోకు తాతా!

వెంక—అదిగో మళ్ళీ అదేమాట. నాకు కోపమొస్తూందంటూ వుంటే?

విక్రి—కాదు; కాదు; వెంకన్నా—నన్ను బహు నిదానముగా జూచుచున్నావు. నన్నెవ్వఅని యభిప్రాయ పడుచుంటివి?

వెంక—ఎవడవో కాని నీల అన్ననే.

వెంక.. ఏమిటీ! నువ్వు నీల అన్నవా? ఔనుఔను అందుకే అచ్చంగా నీలలా గున్నావు ఐతే నువ్వెప్పుడు వచ్చావు! నీలను కలుసుకున్నావా! మాట్లాడావా! నేను వెళ్ళి పిలుచుకొని రానా?

విక్రి—తాతా!............ఇంకెక్కడి.........

వెంక—అదిగో! మళ్ళీ తెగులు పుడుతూంది—పుడుతూంది.

విక్రి—ఆ—ఆ—మరిచిపోయినాను తాతా!—కాదు కాదు. వెంకన్నా—నీల. చనిపోయినది సుమా !

వెంక—అయ్యో—నీలా—నీలా—నీలా—నీకెంతలో నూరేండ్లు నిండిపోయినవే! నీలా—(పెద్దగా నేడ్చును.)

(తరువాత అన్నపూర్ణ ప్రవేశము)

అన్న—ఏమిటి ? వెంకన్నతాతా! ఏడుచున్నావు ?

వెంక__(ఏడ్చుచునే) అదిగో! అన్నపూర్ణగూడా తాతంటూంది__అందఱికీ పెద్ద రోగమే......................నీలా__నీలా నానోట్లో మన్నుబోసిపోయినావా?

అన్న__నీలకేమీ! ఎందుకేడుస్తున్నావు?

వెంక__(కోపముతో ఏడ్చుచునే) పోవే! అన్నపూర్ణా! అట్టే నన్ను వాగించకు_

అన్న__నీల కేమీ!

వెంక__ఆ! ఏముం! చచ్చింది.

అన్న__అయ్యయ్యో! పాపం_ఐతే, నీలకోసం అంత పెద్దగా ఏడ్చుచున్నావేమీ? నీకు చుట్టమా? పక్కమా?

వెంక__ఏడిచేది నీల కొఱకుగాదు.

అన్న__మఱెందుకూ? _

వెంక__ఈకుఱ్ఱవాఁడు ఆడదైతే నీల చచ్చిన విచారంలేకుండా పెళ్లాడుదును గదా__ అని యేడుస్తున్నా - ఆఁ_ఆఁ_(ఏడ్చును.)

అన్న__ఆకుఱ్ఱవాఁ డెవఁడు?

వెంక__నీల అన్నగారు! (ఏడ్చును)

అన్న__(అటుతిరిగి) ఓహో! విక్రమరాజుగారా! ఎన్నాళ్ళకు ఎన్నాళ్ళకు (కౌఁగి లించుకొనును.)

వెంక__(ఏడ్పుమాని తెల్లపోవుచున్నాఁడు.)

విక్ర__తాతా! ఏమి చూచుచున్నావు?

వెంక__(మొగము వికృతముగాఁ జేసి( ఉ....................

అన్న__తాతా! ఏమీ మాటాడవు?

వెంక__(వెనుకటివలెనే) ఆ..................

అన్న__తాతా! తాతా!!

వెంక__తాత!__తాత!!__వద్దన్నకొద్దీ__తాతే!

విక్ర__కాదులే! వెంకన్నా! ఏమిటి తెల్లపోతున్నావు?

వెంక__తెల్లపోతున్నానా?__తెల్లపోవడ మేమిటే...అన్నపూర్ణా! నాగుండెలు దిగజాఱిపోయి నాప్రాణం బేజారై పోయింది.

విక్ర__ఎందుకనీ?

వెంక__మీఇద్దఱికీ__యేదోవుందని__

అన్న— ఓరి నీ పొట్టపొడవా ! ఎంతమాటన్నావురా?

వెంక—(అన్నపూర్ణా విక్రములచుట్టు తిరిగిఆడుచుపాడును.)

## 31వ–పాట బ్యాగ్–త్రిశగతి

అన్నపూర్ణ విక్రముల అతుకే అతుకూ ।
చెప్పకుండా పారిపోతే బతుకే బతుకూ ॥అ॥
చిన్నారి వలపులూ । చిరునవ్వు కులుకులూ ।
కాలరేగి నడువీథిలో । నవ్వో ! చెలరేగి నడువీథిలో ।
హాసము । పరిహాసము । సంత్రాసమూ । అభాసమూ ॥అ॥

విక్ర—ఆ !—ఆ !—ఏమూ యల్లటి?

అన్న—ఈసంగతి యెక్కడను వెల్లడింపవుగదా !

వెంక—ఏమో—నాది తెల్లనోరు—పొరపాటున నోరుజాటితే—

అన్న—నోరు జాటితే— చేయి జాఱుతుందేమో—

వెంక—ఏమో నేను స్థిరంగాచెప్పలేనబ్బా !

విక్ర—అట్లయిన నీకిక దెబ్బలు తప్పవు —పద—

(ఇద్దరు వెంకన్నను కొట్టుచుందురు. తెరవ్రాలును.)

## 3వ రంగము

రాచకొండలోని కారాగృహము.

(ప్రవేశము—వీరభద్రియు, అన్నపూర్ణయు)

అన్న—వీరభద్రా? ధైర్యము దెచ్చుకొనుము. ఈకష్టములు గట్టెక్కగలవు. కొండా రెడ్డి యన్నివిధముల చేతను—సంపూర్ణముగ పరాభవింపబడి పశ్చాత్తప్తుడై యు క్తప్రవర్తనుడు గాగలడు, వానిభీయమింక నీకుండదు, అంతవఱకు, నీవు కన్నులువూపి కాలముగడువుచుండుము. రాజు తొలుత నీ తలిదండ్రులను వధింప గొండారెడ్డి కాజ్ఞనొసంగి మఱల నెందువలననో దేశత్యాగులనుగా మాత్రమే_నీదేభారము.

అన్న— ఉష్ ! ఊరకుండుము. కొండారెడ్డి వచ్చుచున్నాడు.

(కొండారెడ్డి ప్రవేశము.)

అన్న—(ఎదురేగి) వేళ యైనదా! ఇక పురాణము విప్పవచ్చును.

కొండా—అన్నపూర్ణా! నాయెడల నీకింత నిర్భయమేల? ప్రతిదినమును నే నత్యంత క్రోధముతో నే డెట్టులైన వీరభద్రను సాధించితీరెద నను పట్టుదల వహించి యిచ్చటకు వచ్చుచుండ నీవు నన్ను నవ్వించి నా కోపమునుజల్లార్చిపంపి వేయుచుందువు. ఇకనైన మీ వీరభద్రమనస్సు మఱలినదా? లేదా? నిష్కారణముగా నీకారాగృహమున నెంతకాల ముండ గలదు! తన మూర్ఖపు పట్టుదల వీడనంతవఱకు నీ యిడుమలు తప్పవని నీవు దృఢముగా జెప్పుము.........నీ వెందుకు? నేనే చెప్పెదను. నేనే యామెమనస్సును మఱలించెను (దగ్గఱకు జని) వీరభద్రా! మాటాడవేమి? ఎంతకాల మీ కారాగృహమున నుండ గలవు?

అన్న—ఆమెకిక్కడనే హాయిగా నున్నదట! అందుచే ప్రాణముున్నంత వఱకు నిందులోనే యుండునట!

కొండా—నిన్ను నేనడుగలేదు. నీవుమాటాడకు. వీరభద్రా! చెప్పు—ఈవట్టిపట్టుదలతో సుకుమారమగు నీ శరీరము నేల గాసిల జేసికొనెదవు.

వీర—ఓరీ! ఈఅధికప్రసంగ మంతయు నీ కెందుకు? నీవు బ్రతికియున్నంతవఱకు — నాకేసౌఖ్యము నక్కఱలేదు. నే నిందులోనే కాలము గడిపెదను.

కొండా—వీరభద్రా! నాచావుకోరుటకు నీకేమి విషము పెట్టితినో చెప్పు—

అన్న—(చెవులు మూసికొని) రామరామ! వీరభద్రా! నాకు వైధవ్యము తెచ్చిపెట్టకుము. నిన్ను బ్రతిమాలు కొనెదను.

కొండా—అదేమి? మధ్యను నీకేమి వైధవ్యమున్నది?

అన్న—ప్రాణేశ్వరా! మీరిట్టి యమంగళ వాక్యములచే నా మనస్సు నొప్పింపకుడు.

కొండా—ఛీ! సిగ్గుమాలిన శిఖండి! ఎన్ని చెప్పినను—నీవెనుకటి పాట నీవు మానకున్నావు గదా!

అన్న—మీవెనుకటిపాట మీరు మానకున్నారు. నావెనుకటిపాట నేను మానకున్నాను. మన యిరువురి బుద్ధులు—నొక్కరీతిగానే ప్రకాశించుచున్నవి.

కొండా—అన్నపూర్ణా! నీ వెన్నిచెప్పినను వీరభద్రను నేను విడిచిపెట్టను.

అన్న—ప్రాణేశ్వరా! మీరెన్ని చెప్పినను నేను మిమ్ములను విడిచిపెట్టను.

కొండా—విడిచిపెట్టక నన్ను బలవంతముగా పెండ్లిచేసుకొనెదవా యేమి?

అన్న__బలవంతముగా గాదు. మీ రొప్పించిరేని పెండ్లి యాడెదను.

కొండా__లేశమైన నిష్టములేని నన్నెట్టు లొప్పింపగలవు?

అన్న__ఆశక్తి నాయందున్నది.

కొండా__అంతశక్తిగలదాన వైనచో నింతకాలము వీరభద్రునేల యొప్పింపలేదు_

అన్న__అది నా కిష్టములేక

కొండా__ఎందుచేత?

అన్న__సవతి వచ్చునను దుఃఖముచేత_

వీర__అన్నపూర్ణా! అట్లు చీవాట్లుపెట్టి తగినట్లు బుద్ధిచెప్పుము_

కొండా__ఈచీవాట్లకు నేను భయపడు వాడనుగాను.

వీర__సిగ్గును_లజ్జను_ విడిచిపెట్టినచో మూడు లోకములు జయింపవచ్చును.

కొండా మూడు లోకములుగాదు. ఒక్క నిన్నుజయించుటకే నే నారెంటిని వదలి పెట్టితిని.

వీర__తలవాతుకొన్నను_నీకీజన్మమున నిది_సాధ్యము కాదు,

కొండా__సరే! ఎవఱు గెలిచెదరో నీవేచూచెదవు. తొందఱ యెందులకు.

అన్న__(నడుమకు వచ్చి) నేనే గెలిచెదను.

కొండా__నీమాట నెవ్వ రెత్తిరి? ఛీ! పో__

అన్న__(నవ్వును.)

కొండా__ఏమా పరిహాసము?

అన్న__(మఱల నవ్వును.)

కొండా__(చిరాకు పడుచు) ఇది నా కోపమునంతను తగ్గించివేయుచున్నది. ఇది సమయము కాదు. ఒంటిగ వీరభద్రునితో మాటాడెదను. (పోబోవును.)

అన్న__బావా! మాట__మాట_

కొండా__(ఆశతో వచ్చి) ఏమి రహస్యమా?

అన__ఆ__రహస్యమే__

కొండా__ఏ మా రహస్యము?

అన్న__చెప్పనా?

కొండా_అబ్బ! ఆలస్యమేల?

అన్న__వడ్లగింజలో బియ్యపుగింజ,

కొండా — ఛీ! దుష్టురాలా నీవుండగా—నే నిక్కడికి రానేరాను,

అన్న — (నవ్వును.)

కొండా — [కోపముతో నిష్క్రమించును.]

## 4వ రంగము

(పురవీధిలో—వెంకన్న ప్రవేశము.)

### (12వ అనుబంధము)

వెంక — అన్నపూర్ణ—విక్రమరాజును, తగులుకొని పోయింది. ఆహాహా—విక్రమరా జాడ పిలయిలేనా! వెంకన్న అదృష్టమే అదృష్టము—కాని, అన్నపూర్ణని మఱిగిన విక్రమరాజు అడదెలాగవుతాడు? కాడు — కాలేదు — అన్నపూర్ణ నానోట్లో పెద్దకరక్కాయకొట్టి విక్రమరాజు వెంటబడి లేచిపోయింది. నావోళ్లు మంకు కొని పోతూంది. అన్నపూర్ణను చంపేతునా? చంపే స్నేమాత్రం? — విక్రమరాజు ఆడవాతాడా? కాడు — కాలేదు — నానోట్లో వెలక్కాయ — నీలచచ్చింది బతికోసుందా — రాదు — రాలేదు — నా నోట్లో కొబ్బరికాయు — (ఆదలిపడి అటునిటు జూచి) అడుగో! కొండారెడ్డి! సెబాస్! మంచి వుపాయం తోచింది. అన్నపూర్ణ—విక్రమరాజును మఱిగిందని—కొండారెడ్డి చెవులో వూదుతాను—చేయవలసిన పని అతడే చేస్తాడు.

(కొండారెడ్డి ప్రవేశము)

కొండా — [ఆలోచించుచు] ఈయన్నపూర్ణ యభిప్రాయము తెలియరా దయ్యెను. నాపై—మొదటినుండియు ననురాగము గలదియే; కాని—నాచిత్త మన్యథా ప్రవర్తిల్లు చున్నప్పుడు నేను దాని యనురాగము నేమిచేయ గలను? దాని ప్రాప్తమంతే—నాప్రాప్తమింతే—వీరభద్రాగ్రహణము చేసినప్పుడుగదా—నాజన్మము ధన్యమగుట! పానకములోని పుడకవలె నాకీ యన్నపూర్ణ యొకతె నడుమ దాపురించినది గదా! ఇది యెదుటనుండగా వీరభద్ర నేమనుటకును యేమి మాటాడుటకును నాకు ప్రాణసంకటముగా నున్నదే! నేనేమిచేయుదును? పోనిమ్ము—దీని మూలముననే వీరభద్రను చేజిక్కించుకొంద మను కొన్న తనకు సవతివచ్చునని దుఃఖమట—అదియును వలనుగాని పనియే యయ్యె... నిన్ను చేపట్టుదునని దీని కాళజూపి తన్మూలమున వీరభద్రను వశపఱచుకొని పిదప నన్నపూర్ణను నిరాకరింతునా? కాదు కాదు—విన లేదా—అన్నపూర్ణా నిశ్చయమును? తనకు సవతి వచ్చుటయే సమ్మతము గాదట—నన్నెటో

మెప్పించి వివాహ మాడు ధైర్యము తనకున్నదట — ఇట్టి యన్నపూర్ణ నాలంచ
గొండి మాటల నేల నమ్మను? కల్ల — నాకేమార్గమును తోచుట లేదు —

(పోవుచుండగా వెంకన్న యెదురుపడును)

వెంక — (కొండారెడ్డి చుట్టును తిరిగి పాడును.)
("అన్నపూర్ణ విక్రముల అతుకే అతుకూ" అను వెనుకటిరీతిగా)

కొండా — వెంకన్నా! ఇదియేమి? ఆనందముతో నెగురుచున్నావు?

వెంక — (అన్నపూర్ణ విక్రముల అని పాడుచుండును.)

కొండా — (మెడపట్టుకొని) వెంకన్నా! నీకు మతిపోయినదా యేమి? అన్నపూర్ణా యనుచున్నావు... విక్రమరా అనుచున్నావు... అదియేమి?

వెంక — ఓహోహో! కొండారెడ్డిగారా! ఆహాహా! ఏమిచూపు చూచానయ్యా! చూపన్నచూపా! బలేచూపు.

కొండా — ఓరీ! ముసలి కోతి_అరవ నాటకములోని హాస్యగానివలె నూరక అభినయించెద వేమి? నీ యభినయము పాడుగాను ఏదో తెల్పు.

వెంక — కాశీ అన్నపూర్ణదేవిగారి ప్రేమసంతర్పణ.

కొండా — కాశీఅన్నపూర్ణ యెవరు? మన అన్నపూర్ణయేనా!

వెంక — ఇంకెక్కడి యన్నపూర్ణ?

కొండా — ఏమీ?

వెంక — [మరల "అన్నపూర్ణ విక్రముల" అనుపాటపాడుచు ఎగురును.]

కొండా — [వెంకన్నగొంతు పట్టుకొని] తులువా నాతో పరిహాస మేమి? నిజము చెప్పెదవా లేదా?

వెంక — అయ్యయ్యో! చెప్పుచుండగా నన్ను చంపవచ్చెద వేమి?

కొండా — నీవు చెప్పినది నిజమేనా?

వెంక — అబద్ధము లాడుటకు నేనింకను బ్రతికి ప్రఖ్యాతి నందుదునా ముసలి ముండ వాడను.

కొండా — అట్లయిన అన్నపూర్ణా విక్రమరాజులకు సంబంధమనుమాట నిజమా?

వెంక — నాకన్నులతో జూచిన విషయ మబద్ధ మెట్లగును?

కొండా — అదే చెప్పవలెను. నీవేమి చూచితివి?

వెంక — నడువీధిలో — నాయెదుట — నిర్భయముగా — అన్నపూర్ణ విక్రమరాజును "ప్రాణేశ్వరా" యనిపిలచి కౌగిలించుకొన్నది. అడ్డముపోగా నన్నిద్దరును కలసి, చిదుకగొట్టినారు.

కొండా__నేను నమ్మను. అన్నపూర్ణయేమి? నాపై మోహమున జచ్చిపోవు నన్నపూర్ణయేమి? ఆడుమొగపు విక్రమునేమి? వరించుట యేమి?

వెంక__నీవు నమ్మకున్న - నేను వారియింటికి తీసుకొనిపోయి చూపుదును.

కొండా__ఏమి? అన్నపూర్ణ విక్రముని వలచినదా? ఔరా! నాపై నెంత ప్రేమయున్నట్లు నటింపుచు వచ్చె? నేను దీనిమాటలను పూర్ణముగా నమ్మితిని. పోనిమ్ము- దీనికి విక్రముడు ప్రియదర్శనుడయ్యె ననుకొందమన్న - వాని మొగమున నబలాత్వముదప్ప - పౌరుషమే కానరాదే........ఔను నాకీ విషయమున సందేహమేల? ప్రేమ గుడ్డిదిగదా!

సీ. అమితమౌ ధనమున కాశించు నొక్కతె
మొగమునందముఁ గాంచి మురియు నొకతె
కేరడంబులు గాంచి కిచకిచ మనునొక్తు
సిగ మల్లెపూలకై చెలఁగు నొకతె
ఆషంగితనమును హర్షించు నొక్కతె
సంగీత మాలించి పొంగునొకతె
చొల్లుడాబులు విని యుల్లసిల్లునొకర్తె
నడకతీవినిఁ జూచి మిడుకు నొకతె

గీ. ముంగురులు గిరజాలకై మురియు నొకతె
నాటపు వేషమునఁగ న్గీటు నొకతె
వెఱ్ఱివాని నవ్వులకును వెలఁది ప్రేమ
కెంత తలచింపుకొనినను హేతువున్న!

(వెంకన్నతో నిష్క్రమించును)

---

## ౬ రంగము

అన్నపూర్ణ యిల్లు

విక్రమరాజు__(తలుపు తట్టుచు) ప్రాణేశ్వరీ! ప్రాణేశ్వరీ!

అన్న--(తెరలో) ఆ! ఇదిగో__వచ్చె--వచ్చె.

(కొండారెడ్డి వెంకన్న ప్రవేశించి చాటున నిలతురు.)

కొండా__చూచితివా! వెంకన్నా! ఆదుష్టు డిక్కడికే వచ్చినాడు.

వెంక — అదృష్టుడు వచ్చుటే కాదు. అదృష్టయు రానున్నది.

(తెలుపు తెఱువబడును.)

కొండా — (కోపము నభినయించును.)

వెంక — (ఊరకుండు మని నివారించును.)

విక్రి — ఏ మడుగుచున్నావు? ఎప్పుడు వచ్చితిననియా? నేటి మధ్యాహ్నముననే వచ్చితిని. రాజుగారిని సందర్శించి చెప్పవలసిన మాటలుచెప్పి యాలస్యమైనచో నీ కేమి కోపమువచ్చునో యని వచ్చినాను.

అన్న — ఎంత భయము! పాపము! నాభయముచేతనే యిట్లు శుష్కించిపోవుచున్నావు కాబోలును.

విక్ర — ఔను — నిజముగా నట్లే — నీవు నన్ను బెండ్లాడెదవో లేదో యను విచారము చేతనే నిరంతరము నిట్లు — శుష్కించి పోవుచున్నాను.

అన్న — ఆలాగుననా? అబ్బ! ఇంతలోనే యెంత గడుసుదనము నేర్చుకొంటివి. (ముద్దిడుకొనును.)

కొండా — (తలకొట్టుకొని) ఆహాహా! ఎంత దుర్భరము! ఎంత దుర్భరము!! ఆడు ముండలను నమ్మి చెడిన యధమాధములలో నే నొకండ నైతినా! నా తెలివి యిప్పుడేమి పనికివచ్చినది? ఎన్నెన్ని కొంపలనైన నొక్క కొఱవితో గాల్చగల జగజ్జంతలు గద! వీరు!

గీ. ఒక్కనికిఁ గన్నులను సంజ్ఞ; ఒకని కతిర
హాస్యముగ వార్త; ఒకని కత్యంత ప్రీతి
యొక్కనికి బాస జేసి వేఱొకనిఁ గూడి
కల్లలకు నిల్లగుదు రయ్యో కమలముఖులు.

వెంకన్నా! నే నీ దృశ్యమును జూడలేకున్నాను. ఈ విక్రమరాజును, జూచిన నాశరీరము తపించుకొని పోవుచున్నది. నాకు ప్రతిస్పర్థియై వీ డెక్కడ దాపురించెను. వీని నిప్పుడే చంపకున్న నాకు శాంతములేదు.

వెంక — అయ్యయ్యో! మీ రాలోచన లేక తొందఱ పడుచున్నారు. మీరు విక్రముని చంపినంతమాత్రమున నన్నపూర్ణ సమ్మతించునా? అంకుమగనిని మఱగిన దానిని కుళ్ళిన శరీరభాగమునువలె — కోసివేయ వలయు గాని... ..

కొండా — ఉండుండు — మఱల నేదో శృంగార ప్రబంధమును విప్పినారు.

అన్న — విక్రమా! నీవు మాధవపురమున కేగి వచ్చులోపల నిన్ను జూచి యెందఱు కన్యలు మోహించిరో చెప్పు.

విక్ర—నేను చెప్పను; నీవు నన్ను పెండ్లియాడెదవా లేదా? లేనియెడల నిదిగో కత్తి; చూఁడు—

అన్న—(నవ్వుచు) ఓహో—నీధైర్యమునకు తోడుగా—నీవద్ద కత్తిగూడ నున్నదా? నీ కిది యెవ్వ రిచ్చినారు?

విక్ర—మహారాజగు ననపోతనాయఁడు.

అన్న—సరేకాని మన మిదివఱలో ననుకొన్న కార్యమును గూర్చి యెప్పుడు?

విక్ర—చెప్పెదను; భోజనమైన పిదప మనమిరువురమును పండుకొని సావకాశముగ మాటలాడుకొనవచ్చును; లోపలకురమ్ము.

(ముందు తెరవ్రాలును)

కొండా—(విచారముతో కూర్చుండును)

వెంక—కొండారెడ్డిగారూ! ఇక్కడ వీధిలో కూలబడితిరేమి? ఇంటికిఁ బోవుదము రండు.

కొండా—నేను రాను; నీవు పో—

వెంక—మీ గౌరవమేమి? మీయధికారమేమి? మీరిట్లు నడువీధిలో కూర్చుండిన నవ్వులాటగా నుండదా!

కొండా—నన్నిప్పు డెక్కడికి రమ్మనెదవు?

వెంక—మీయింటికి

కొండా—నా కింట నేమున్నది?

వెంక—ఇక్కడమాత్ర మేమున్నది?

కొండా—ఇక్కడను లేదు—ఇంటను లేదు—ఎక్కడను లేదు. నావ్యవహార మంతయు గందరగోళమునఁ బడిపోయినది. చల్లని గాలివచ్చుచోటికిఁబోయి యీరాత్రి గడపి వచ్చెదను. నీవింటికిఁ బొమ్ము.

వెంక—ఒంటరిగఁ దిఱిగెదరా—ఈరాత్రి—అయ్యయ్యో! అమావాస్య చీకటియే—పామో—తేలో—

కొండా—నీవునన్ను మఱింత యల్లఱిచేయుచున్నావు. వెళ్లు. (లేచినడచును)

వెంక—(పోవుచుఁదనలో) అది కాళ్లపైఁ బడినన్నాళ్లు కాలఁదన్నినాఁడు—మించిపోయిన తరువాత—మిడుకుచున్నాఁడు.

కొండా—వెంకన్నా! ఇటురా—ఈపాదరక్షలు నాగమనము నాటంక పఱచుచున్నవి. నాకీ యుత్తరీయమువలన చెమ్మటపోయుచున్నది—దీనినిఁ గొనిపోయి నాయింటనుంపుము—ఇంకొకమాట—ఈచీటినిఁ గొనిపోయి కారాగృహాధికారి కిచ్చి వీరభద్రను విడుదలజేయుమని చెప్పుము. (వ్రాసియిచ్చును.)

వెంక—అయ్యయ్యో! వీరభద్రనే! కొండారెడ్డిగారూ! మీకినాడు వెఱ్ఱెత్తినదాయేమి?

కొండా—దుర్మార్గుఁడా! నీకదియేల? వెళ్లెదవా! లేదా?

వెంక—(భయముతో నిష్క్రమించును.)

శాంతా — (తలపంకించుచు) ఛీ! ఛీ! ప్రపంచ మింత కపటభూయిష్ఠమని యెఱుంగక మూఢుఁడనై చెడితిని. ఎన్ని యిచ్చకములు ఎన్ని నైచ్యాను సంధానములు — ఎన్ని పరిహాసము లాడి తుదకీ జారిణికృత్యమునకుఁ బాలుపడినది! పరమేశ్వరా! నన్నిట్టి భయంకర నారీపిశాచముల బారింబడకుండఁ గాపాడుము. ఇట్టి ప్రేమయుండే ఇట్టి భీకరమగు మోసము సంఛన్నమై యున్నప్పుడిఁక మిగత యాఁడువాండ్ర లెక్కయేమి? ప్రపంచమున సత్యప్రవర్తనము గల యాఁడుదిలేదు — లేదు — ఇదినిర్ధారణము — నిస్సంశయము — ప్రణయమా! నీకొకనమస్కారము — నేనీ జగమున మరణించు నందాక స్త్రీజాతిని విశ్వసింపను — విశ్వసింపను. వీరభద్రియు నన్నపూర్ణయు నేమైననగుదురు గాక వారి ప్రశంస నాకు వలదు — వలదు. నేను వివాహమాడక బ్రహ్మచారినై యుందును గాక! ఓ ప్రపంచ జనులారా! మీరందఱును నావలెనే — ఆ స్త్రీ జాతినినమ్మి మోసపోక మెలఁకువగలిగి ప్రవర్తింపుఁడు — ఈ పయోముఖ విషకుంభములపాలికిఁ బోకుఁడు. ఈతృణచ్ఛన్న మహాగర్తములలోఁ గూలకుఁడు. ఈతేనెపూసిన కత్తులను తాకకుఁడు. ఈకప్పకూత పాములనోట బడకుఁడు. ఈగోముఖవ్యాఘ్రముల దరియకుఁడు. జాగ్రత్త! జాగ్రత్త!! జాగ్రత్త!!!

సీ. మగఁడు నిద్రింప మార్మగనితో నేకశ
య్యనె మారవిక్రీడ లాడువారు
పరపూరుషులకయి ప్రాకులాడుచు విష
మిచ్చి భర్తల మడియించువారు
పతిని బొమ్మనుఁజేసి పరులతో నాతని
యెదుటనే బూతులు వదరువారు
వంటయింటికి భర్త నంటించి వాఁకిటఁ
జేరి కచేరీలు సేయువారు

గీ. సదయులా భర్తలనుఁ గొట్టి శక్తులట్టు
లిల్లు తలకెత్తుకొని బిగ్గ నేడ్చువారు
శంకిణీజాతిముండల సరసఁబోక
మేలుకొనరయ్య! మనరయ్య! మిత్రులార!!

(నిష్క్రమించును.)

చతుర్థాంకము సంపూర్ణము.

# ధరణికోట

— ♦ రెడ్డివీరుల సంగ్రామకథ ♦ —

## పంచమాంకము

### 1వ రంగము

[రాచకొండలో నొక గృహము.]

[పఠాను వేషములతో ఖడ్గనారాయణ, మల్లినాథ, కృష్ణరాజులు ప్ర॥

ఖడ్గ___మిత్రులారా! ఈపఠాణీ వేషములవలన మనము___మన నిజాకృతులు గుఱుతింపఁబడని చందమున ననపోతనాయని వంచించి యాతనివద్దనే___సేనాధిపతులకు మిగుల ప్రాపకము సంపాదించుకొని కృతార్థులమైతిమిగదా! ఇఁకమన చాతుర్యముచే కొండారెడ్డికిని అనపోతనాయనికిని విరోధముఁ గల్పింపఁ గల్గితిమా మనకోరిక పరిపూర్ణమందినటులే.

కృష్ణ___అందులకు వేంకన్నగాడి సహాయముం గొనుట శ్రేయము. మొన్న నొకనాడు నేను వానికి కొంచెము సురారసమునిచ్చి ప్రేలించితిని. సురగాని ధనముగాని, యొక పడుచుపిల్లగాని, వానికి దొఱికినచో నెంతపనియైనఁ జేయుటకు వెనుదీయఁడు.

ఖడ్గ___అట్లయిన నీ మూఁడింటిచేతను వానిని వశపఱచుకొందము.

మల్లి___ఆసంగతి గుఱించియే రెండు సారాయిబుడ్లను సిద్ధపఱచి యుంటిని.

ఖడ్గ___మల్లినాథా! నీవు బుద్ధిశాలి వగుదువు.

కృష్ణ___అడుగో___అనుకొన్నవేళకు వేంకన్నయు నిట్లే వచ్చుచున్నాఁడు. మనము కార్యారంభ మిప్పుడే చేయవచ్చును.

(పాదరక్షలును, ఉత్తరీయమును, చేతఁ బట్టుకొని వేంకన్న ప్రవేశము.)

వెంక___పఠాణీసాహెబులకు సలాములు___ఇక్కడ నేదో పనిమీద నున్నట్లున్నారు.

ఖడ్గ___ఏమున్నది! వేంకన్నా! కొంచెము హుషారీకొఱకు మధురసము సేవించుచున్నాము.

మల్లి___(బుడ్డిని బయటకుఁదీయును.)

వెంక___(గుటుకలుమ్రింగి) నిండుగానే వుందే!

కొండా__(దగ్గఱకు వచ్చి రహస్యముగ) ఖడ్గనారాయణా! సరే! నీవు న న్నేమన్నను నేనిప్పుడు నీకు మిత్రుడనే కాని శత్రుడను గాను. ఐనను_ నాకొక సందేహము బాధించుచున్నది? తీర్చెదవా!

ఖడ్గ__నీ సర్వసందేహనివారణము చేయుటకే కదా_వచ్చితిని!

కొండా__నీకీ యనపోతనాయుడు గర్భశత్రువుగదా! అట్టివానిని నేను చంపవచ్చుచుండగా_నీవేల నన్నాటంక పఱచెదవు!

ఖడ్గ__అది యంతయు నీకేల? రణము చేయుదువా? శరణము చేయుదువా?

కొండా— నీవు పిశాచము నైనందున మనుష్యులకన్న నధిక క్రోధ ముండదగినదిగదా_రమ్ము మనమిద్దఱమును కలసి వీనిని బంధింతము.

ఖడ్గ__ఛీ_ఇక శాంతించిన లాభములేదు. క్రమముగా నీ యున్మాద మతిరేకించుచున్నది. రమ్ము_బలవంతముగ నిన్ను రణమునకు చేర్చకపోక తప్పదు: (కత్తి గ్రిప్పుచు పైకొనుచున్నాడు.)

కొండా__ఆ__ఆ__శాంతింపవా? శాంతింపవా?

ఖడ్గ__ఇక శాంతిలేదు__దాంతిలేదు, రమ్ము.

కొండా__ఓహో! ఎంత చెప్పినను వినవుగా! అట్లయిన__నీపిశాచాకృతిని గూడ ధూమిస్సై లేకుండ జేసెదను రమ్ము.

[ఇద్దఱు పోరుదురు. కొండారెడ్డి ఖడ్గనారాయణుని చంపబోగా__వీరభద్రుడు వెనుకనుండి కొండారెడ్డి కత్తిని లాగివేయును. కొండారెడ్డి పారిపోవును.]

అన__(ఖడ్గనారాయణుని పాదములపైబడి) ఖడ్గనారాయణా నేను నీయం దపరాధము జేసినను నీవు నన్ను రక్షించితివి. నీ సౌజన్యము స్తుతిపాత్రమైనది నన్ను క్షమింపుము.

ఖడ్గ__ఛీ! పాపాత్ముడా లెమ్ము: నేను నీయందలి దయచే రక్షింపలేదు_ఇప్పుడు వధింపక మానను రమ్ము.

**గీ. నిన్ను బంధించి నాతండ్రి సన్నిధాన**
**మందు, నిలిపెదనని సభయందు ప్రతిన**
**సేయుటను కొండరెడ్డి నిన్ జెనకకుండ**
**గాచిన నిన్ను; దయచేత గాదుసుమ్ము.**

కొండారెడ్డిచే నీమరణంబు తప్పినను _ నాచే దప్పదురమ్ము__

కొండా__(చాటున దాగియుండి విని) భళి ఖడ్గనారాయణా నీ హృదయము నింతదనుక గ్రహింపలేక పోయితిని.

ఖడ్గ—పరాత్పరుడు నీపాపములను క్షమించెను. అంతర్వాణియట్లు - మనల నాశీర్వదించుచున్నది, మన కిక విజయమే సిద్ధాంతము లెమ్ము.

కొండా—ఖడ్గనారాయణా ధన్యాత్ముడ నైతిని.

ఖడ్గ—శూరాగ్రేసరా! నీచే మాపక్షమునఁ దొలుత నుండియున్నచో - మాకీ కష్టము లేకుండునుగదా!

కొండా—ఖడ్గనారాయణా! నీవు నిజముగ ఖడ్గనారాయణుఁడవేనా! అతని పేరాస వ్యక్తివి కావుగదా!

ఖడ్గ—నీ విట్టేల నున్మత్తుడ వైతివో - నాకు విస్మయముగ నున్నది.

కొండా—నేను నిన్ను చంపితిని గావున-

ఖడ్గ—నన్నెప్పుడు చంపితివి?

కొండా—ఇదిగో నీశిరస్సు - (చూపును)

కళా—కొండారెడ్డిగా రిప్పుడు పూర్తిగా వంచింపబడిరి.

కొండా—ఎందుచేత?

కళా—అది వీరభద్రు నిర్మించిన ఖడ్గనారాయణుని ప్రతిమాశిరస్సుగాని నిజమైనదిగాదు.

కొండా—(పరికించి) ఆహా! ఎంత ప్రకృతిసిద్ధముగ నున్నది. దీనిఁజూచి నేను వెకిలి నైతిని. అట్లయిన నీ యశుభచిహ్నమిక నేల? పారవేయనా?

కళా—అశుభ మేమి? దీనివలన ఖడ్గనారాయణుని పీడ తొలంగెను,

ఖడ్గ—సోదరా! దీనిని పారవేయవలదు. దీనితో నింకను పనియున్నది. మన వెంటనే యుండనిమ్ము,

కొండా—సోదరా! ఇంక రెడ్డివిజయ పతాకము నెత్తుకొని ధరణికోటలో జరుగుచున్న యుద్ధమునకుఁ బోవుదము.

ఖడ్గ—ధరణికోటలో యుద్ధము జరుగుచున్నదా!

కొండా—ఔను - నీతండ్రి నీపై బెంగచే వ్యాధిశయ్యపైనున్నాఁడు. అనపోతని తమ్ముఁడగు మాధవనాయఁడు యుద్ధము చేయుచున్నాఁడు.

ఖడ్గ—అట్లయిన ఆలసింపఁ దగదు రమ్ము.

అందఱు (పతాకముల నెత్తుకొని) జయ్! రెడ్డిసామ్రాజ్యలక్ష్మికి జయ్

(నిష్క్ర-ము)

షష్ఠాంకము సంపూర్ణము.

—♦—

# ధరణికోట

—♦ రెడ్డివీరుల సంగ్రామకథ ♦—

## సప్తమాంకము

### 1 వ రంగము

ధరణికోటలోని రాజమందిరము.

[వ్యాధిశయ్యపై - అనవేమారెడ్డి॥ ప్రక్కన ఎఱ్ఱాప్రగడ॥]

( 46 వ అనుబంధము )

అ_వే__ (పరుండును)

ఎఱ్ఱా__అయ్యయ్యో! ఎంత ప్రారబ్ధము! ఘోరమైన సంగ్రామమాపల జరుగుచుండుట యేమి? శత్రునిర్జయ సమర్థుండగు కుమారవీరుడు దేశత్యాగియైపోవుట యేమి? ఈ మహారాజ్యము దుర్గతియేమి? రెడ్డిరాజుల కిక పరాజయమే కలుగనున్నదా! ఎట్టి సామ్రాజ్యమున కెంతలో నిట్టిపాటు గలిగెను.

అ_వే__(కలువరించుచు) నాయనా! నా ఖడ్గనారాయణా! నాఖడ్గనారాయణా!! నన్ను వదలి యెక్కడికిఁ బోయెదవు? తండ్రినే! నీతండ్రినే!! నాయనా!

ఎఱ్ఱా__అదిగో మరల కలువరించుచున్నాఁడు, రాజేంద్రా ఏమి యీ కలువరింతలు.

అ_వే____(లేచి) ఎవరు మీరు? నా కుమారు నెత్తుకొని పోవచ్చిన దుష్టచిత్తులా? తెండు__తెండు__నా కుమారునిఁ దెచ్చి నాకిండు,

ఎఱ్ఱా__రాజేంద్రా! నేను ఎఱ్ఱాప్రగడను, నన్ను శత్రునిగా నేల భావించెదవు? నీకుమారుఁడు సజీవితుడైయుండును. ఎన్నటికైన దర్శింపఁగలవు. దుఃఖింపకుము.

అ_వే__నాతండ్రి! ఎఱ్ఱాప్రగడా! ఇట్లు నాకుఁ బ్రియవాక్యములు పలికిన నీకు గనకాభిషేక మగునుగాక. నాకుమారుఁ డెక్కడ నున్నాఁడు? ఏదియో వార్త తెలిసిననేగాని మీరిట్లాడరు. నాకు వాని యునికి నెఱిఁగింపుఁడు. ఈ ముసలి భుజములపై నెత్తుకొని లాలించెదను.

ఎఱ్ఱా__నాకు తెలియదు; కాని, శీఘ్రకాలమున మనకన్నులఁ బడునను నాశ గల్గుచున్నది.

అ_వే__ఛీ! ఛీ! ఎవ్వరిని నమ్మినను లేకదా! ఇంతేకదా! ఇంతేకదా నాబ్రతుకు?...ఔను_నాకిక వేరుగా నగునా? స్వల్పాపరాధమును ఘనముగాఁ బరిగణించి నా కుమా

రుని సకలదుర్గుణ లక్షితాకారుని పరాభవించి పంపితినే ఎక్కడనున్నాడో
ఏయవస్థల ననుభవించుచున్నాఁడో! నా కింకెటులఁ దెలియదయ్యె. ఎఱ్ఱాప్రెగ్గడా
నేను మరణించులోపల నా కుమారునిఁ జూడఁగలనా ?

ఎఱ్ఱా—అయ్యయ్యో! ఎంత పెంగటిల్లుచుంటివి: రాజేంద్రా! ధర్మస్వరూపుఁడవగు నీకు
పరమేశ్వరుఁడు కష్టమును గలిగింపఁడు నామాటనమ్ముము.

అ_వే—కుమారా! కుమారా!

సీ, కఠినాత్ముఁడైన నా కన్నతండ్రి కతానఁ
జెకతి నిట్లని మృతిఁ జెందినావొ-
అడవులలోన గుహాంతరంబుల నన్ను
తపియింపఁ జేతువో జవమునీవు
లలి-రెడ్డిసామ్రాజ్య లక్ష్మీసమాశ్లేష
వరసౌఖ్యగరిమ మైమఱచినావొ
బంధువర్గముల లోపలఁ దలనెత్తలే
కే గహనములలో దాగినావొ-
గీ, పుత్రవాత్సల్యహీనుఁడౌ శాత్రవుండ
నైన ననుఁ గాంతువో లేదొ! తనయ నీవు
తలకొఱవి నా కొసంగఁగాఁ దగిన నీదు
కరములను నేను బూదిగాఁ గలనొ లేనొ!

అ_వే—ఎఱ్ఱాప్రెగ్గడా ఏ మాధ్వని!

ఎఱ్ఱా—మహారాజా! మహాసంకుల సంగ్రామము ప్రవర్తిల్లుచున్నది

అ_వే—నేడీ యర్ధరాత్రమునను, యుద్ధము జరుగుచున్నదా!

ఎఱ్ఱా—ఔను: మహారాజా! ఈ యుద్ధమింకొక జాము జఱిగినచో దుదకుఁ బరా
జయమే సిద్ధమని. సైనికులు తలంచుచున్నారు.

అ_వే—అయ్యయ్యో! ఇప్పుడు నాకుమారుఁడున్నచో నీ శాత్రవులను. సదమదించు
శక్తిగలవాఁడగును గదా!.........ఓ. రెడ్డి రాజ్యలక్ష్మి! నీకుఁ జేతులార
వైధవ్యమును సమకూర్ప నీ దురాత్ముఁడు, సంసిద్ధుఁడైనాఁడు.

మ, జననీ రెడ్డిజయేందిరా! మిగుల, దుష్టాత్ముండనౌ నేను నా
తనయుం గ్రూరనిశాతవాక్యముల, సంతప్తాశయుం జేసి. దు
ర్జనులౌ శత్రులకప్పగించి, ధనమ్ముగ్ర క్రోధ దావాగ్ని కిం
ధనమైపోవఁగ నుంటి, కావవె ననుం గారుణ్య చిత్తంబునన్.

( తెరలో )

ఓహో! రెడ్డివీరులారా! వెలువకుఁడు! వెలువకుఁడు — భిల్లసేనలతోఁ గృష్ణరాజు మీకు సహాయుఁడయ్యె — కృష్ణరాజుతో వచ్చిన — భయంకర భిల్లవీరుం డెవ్వఁడో శత్రువుల నరఁటికంబముల వలె నఱుకుచున్నాఁడు. చెదరిపోయిన మీ ధైర్యమును సమకూర్చుకొనుఁడు —

అన — ఎఱ్ఱాప్రగ్గడా! ఇది మన రామాప్రగ్గడ ప్రబోధముగా నున్నది. ఎవ్వఁడో భిల్లవీరుఁడు దారుణప్రవిదారణము సలుపుచున్నాఁడఁట? ఈ గవాక్షమార్గమునుండి రణచాతుర్యముం బరికింతము. రమ్ము —

ఎఱ్ఱా — మహారాజా! నా భుజాగ్రము నానిఁడు బలహీనతచే సోలిపోవఁగలదు.

( యథాప్రకారముగా, గవాక్షసమీపమున నిలతురు )

అన — ఎఱ్ఱాప్రగ్గడా! అటు చూడుఁడు —

సీ. అగ్నిగోళంబుల ననుకరించెడు చల,
దక్త విస్ఫార నేత్రములవాఁడు
బహువిధారిందము ప్రఖ్యాత పరశు — నం
కలిత దివ్యాంస భాగంబువాఁడు
బర్హిబర్హముతోడ, పాలపూసలతోడ
దంబైన శిఖరి పింఛంబువాఁడు
అరిభీకరంబైన యసిచాలనముచేత,
మించిన భీతిఁ గల్పించువాఁడు
గీ. శ్యామలంబైన దివ్యతేజంబువాఁడు
శత్రురక్తాభిషేక యశంబువాఁడు
అహిత శిరకందుకక్రీడ లాడువాఁడు
భిల్లవీరుఁడు కనులకు విందు జేసె —

ఎఱ్ఱాప్రగ్గడా! ఈతఁడెవ్వఁడో కాని, నా కీతని గౌగిలించుకొని, ముద్దాడ నపేక్ష గల్గుచున్నది సుమా!

( తెరలో )

ఓహో! ఎఱ్ఱాప్రగ్గడ యెక్కడ! ఎఱ్ఱాప్రగ్గడ ఎక్కడ! దక్షిణద్వారము రక్షణ రహితమై యున్నది. ఆయన, నా దెస నుండుమని చెప్పుడు. లేనిచో యాదారి రిపులు పురమున బ్రవేశింపగలరు

ఎఱ్ఱా — మహారాజా! నేను దక్షిణద్వారమున కరుగుదును. ఇంక మనకు పరాజయ భీతి లేదు. మీరు శాంతముగ నుండుడు.

(అనవేమారెడ్డిని పరుండబెట్టి నిష్క్రమింత్రు)

అన—(పరుండి నిద్రలో వణకుచు) తల్లీ! ఎవ్వరు నీవు? త్రిశూలపాణివై—నాపై కేల విజృంభించి వచ్చెదవు? నేనేమి చేసితిని? ఏమి! నీవు రెడ్డి సామ్రాజ్య లక్ష్మివా? తల్లీ!—అట్లయిన నా దెసకు రాకుము.

**గీ. విశ్రుతాన్వయ గౌరవాపేక్షమాని**
**శాత్రవులఁ గొల్చినట్టి విశ్వాసహీను,**
**లను, వధింపఁగ నగుఁగాని నను వధింప**
**నేమిపని? రెడ్డిరాజ్య రమా మతల్లి—**

ఏమి? నీవునటివాఁడవే యనుచుంటివా?—పుత్రద్రోహివనుచుంటివా! అగును నేను పుత్రద్రోహినే! కావుననేయిట్లు లేశ్చుచుంటిని పుత్రునిఁబాసిన దుఃఖమే నిశిక్షకన్న నధికమై యుండ, నీవేల నన్నింకను శిక్షింపవలయును—అమ్మా! రెడ్డిసామ్రాజ్యలక్ష్మి—నీవు సర్వశక్తి క్రియాస్వరూపిణివి—నాకుమారుని నా కిమ్ము—నీయానతిచే వాని నీసామ్రాజ్యాధినాయకునిఁ జేసెదను—జేయకుండిన నాశిరస్సుఁ గొనుము—తల్లీ! క్రోధకటాక్షములతోడనే, తిరోహితవై పోయితివా? అటయిన నాగతి నేమిచెప్పిపోయితివి? నాకు మరణమే శరణమా...... తండ్రి! ఖడ్గనారాయణా? నీవు నన్నెడబాసిపోవుటచేతఁ గదా నా కీగతి ప్రాప్తించెను—నాతండ్రి!—నీ వియోగదుఃఖము నన్నట్లు దహించుచు కుమారా! కుమారా! (మూర్ఛిల్లును.)

(రాణి రహస్యముగా, కరవాలముం గొనివచ్చి రాజును చంపఁబోగా కొండా రెడ్డి వచ్చి, చేయుపట్టుకొనును.)

కొండా—ఓసీ! హంతకీ! పూజ్యుఁడగు మహారాజునే, చంపఁ దలంచుచుంటివా! నీకంఠము నుత్తరింతును చూడుము. (చంపఁబోవును.)

(కరవాలహస్తుఁడై—ఖడ్గనారాయణుఁడు అనపోతనాయని బంధించిన వీరభద్ర కళాపూర్ణులు, ప్రవేశము)

ఖడ్గ—సోదరా! ఇది యేమిపని!

కొండా—సోదరా! నీ వడ్డము రాకుము. ఇది మనమహారాజునే చంపఁదలఁచినది; దీనిని బ్రతుకనీయఁ గూడదు.

ఖడ్గ—నా మాట వినుము. స్త్రీహత్య మనకు తగినది కాదు.

కొండా—ఓసీ! దుష్టురాలా! నీ ప్రాణములను మాత్రము వదలితిని. నీకు బంధనము తప్పదు.

(వీరభద్ర, కళాపూర్ణులు రాణిని బంధింతురు.)

అన—(లేచి)మీ రెవ్వరు? నెవ్వరు?

కొండా__రాజేంద్రా! నాయపరాధములు క్షమింపుము. నేను కొండారెడ్డిని.

అ. వే__ఓరీ! కొండారెడ్డీ నాపుత్రుని బంధింపఁ జేసితివి గాదా! నీయుసురు తగిలియే నేనిప్పటికి పుత్రహీనుఁడనై యున్నానురా!

కొండా__మహారాజా! నద్రోహములకు ఫలము ననుభవించితిని. ఇక నాకు ప్రాయశ్చిత్తము వలదు. నీవాఁడను నన్ను నీ రెడ్లలోఁ గలుపుకొనుము. అనపోతనాయని బంధించి తెచ్చితిని.

ఖడ్గ__రాజేంద్రా! అనపోతనాయని రాణి మిమ్ము వధింపనెంచుచుండగా__నీకొండారెడ్డియే మిమ్ము రక్షించెను.

అ. వే__కొండారెడ్డీ! చిరాయుష్మంతుఁడవు గమ్ము నాయనా! కాని యీముసలి వానిని__చావనీయకుండ, రక్షించితివేలనయ్యా!

కొండా__ఇంక మీకేల విచారము? అనపోతనాయఁడు బంధితుఁడై మీయెదుట నున్నాఁడు, చూడుఁడు.

అ. వే__నాతని నెవరు బంధించిరి.

కొండా—ఈ కేదారనాథుఁడు__

అ. వే__నాకుమారుఁడు బంధింపలేదా?

కొండా__లేదు__

అ. వే__అట్లయిన యిక నాకుమారుఁడు నా మొగము చూడఁడు. వానికిని, నాకును, ఋణము తీరిపోయినది.

కొండా__ఇంకను నీకుమారుఁ డెక్కడ! ఇదిగో శిరస్సు!

అ. వే__హా! కుమారా!! మూర్ఛిల్లును.)

(తెరవ్రాలును.)

—♦—

## 2 రంగము—ధరణికోటలో

(అనవేమారెడ్డి దర్బారు)

(బంధితులగు అనపోతనాయఁడును రాణియు నొకప్రక్కనుందురు)

(అనవేమారెడ్డి, ఎఱ్ఱాప్రగ్గడ, రామాప్రగ్గడ, మల్లినాథుఁడు, కృష్ణరాజు, కొండారెడ్డి, ఖడ్గనారాయణుఁడు, కళాపూర్ణకుఁడు, వీరభద్రుఁడు ప్రవేశింతురు.)

అ. వే ఎఱ్ఱాప్రగ్గడా! అందఱును వచ్చిరా?

ఎఱ్ఱా__ఆఁ! వచ్చినారు__

అ. వే__అయ్యయ్యో! మొండిదైన పీనుఁగునకు, నాపాపపు మొగము చూపించుచు__ చేటంతకొడుకును మ్రింగి ఉడుకు విధిలేక, సభలు నయితము సాగింపవలసి

వచ్చెనా? నన్నేల శత్రురాణిచే చావనీయక, కొండారెడ్డి బ్రతికించెను!

గీ. జయము లభియించెనను, సంతసంబు నాదు
హృదయమునఁ దోఁపదొక్కింతయేని గాని,
రణఫలంబు, కుమారమారణ ఫలంబె
గాని, నాకిది విజయంబు గాదుకాదు;

ఖడ్గ—(దగ్గరకి వచ్చి) స్వామీ! తమ కుమారులము మేముండలేమునా గామా! తమకు కుమారులు లేని కొఱత యేమి?

అ_వే—ఎవరు మీరు?

ఖడ్గ—స్వామీ! రాచకొండ రాజును - రాణిని బట్టి తెచ్చిన కేదారనాథుడను సన్యాసిని—

అ_వే—అయ్యా! సన్యాసివగు నీ కింత పరాక్రమ మెక్కడనుండి వచ్చెను?

ఖడ్గ—యోగులకు సర్వశక్తులును, గగతలానులకము లని యెఱుగరా?

అ_వే—అయ్యా! నీవు శత్రురాజును బట్టుట చేత నా కుపకారము చేయబోయి, యపకారము చేసితివి సుమా!

ఖడ్గ—అయ్యా! నాయపకారమేమి?

అ_వే—అపకారమే కాదా! అనపోతని బంధింపక నా మొగము చూపకని గదా, నా కుమారు డాసభలో ప్రతిన బట్టెను. ఇప్పుడు—వాని కనపోతని బంధించు మార్గములేదు నాకు వానిని చూచుప్రాప్తి లేదు.

ఖడ్గ—అంత పుత్రవాత్సల్యముగల మీ రట్టి షంతులచే నేల మీ కుమారుని నిర్బంధించిరి?

అ వే—అదేనోయి నాయనా! నా బుద్ధిహీనత. అదేనోయి

చ. మతిచెడి, వార్ధకంబునఁ గుమారునిఁ దిట్టి పరాభవించితిన్;
ప్రతిన యొనర్చి—పుత్రకుఁడు బంధుల రాజ్యము వీడిపోయె—నా
కతుకము గంగలోఁ గలిపె; కూర్చుకువా రెవటింక నాకు, నా
మృతికిఁ దిలోదకంబు లొనరించెడు వారును లేరు ధారుణిన్.

ఖడ్గ—చిన్నకొడుకున్నాడుగదా!

అ_వే—చిన్నకొడుకా? ఎవరు కలగనిరి? ఇంతకొడు కట్లయ్యెనుగదా! ఇక వీడా? ముక్కులోని వెండ్రుక కొప్పులోని కదిగిన మాటగదా! అదిగాక, వాడును, యుద్ధమున గాయములు తగిలి వైద్యుల చేతులలో నున్నాడు!

ఖడ్గ—రాజేంద్రా! అట్లయిన, నేను నీకు తలలో నాల్కగానుండెదను. పెద్దకాలమున మీ ముప్పు వెడలించెదను. నన్ను పెంచుకొనరాదా!

అ-వే—మీ కింతటి యనుగ్రహ మేల కలుగును? మీరు సర్వశక్తులుగల యోగిసత్తములుగదా!

ఖడ్గ—మీకా భయమేల? నే నుండెద ననుమంటిరి గాదా!

అ-వే—ఆహా!—ఇట్లయిన పెంచుకొందును కాదు—నన్నే నీవీ పెద్దకాలమున కుమారునిగాఁ బెంచుకొనుము తండ్రీ! యిట్లురమ్ము. నిన్నుఁ జూచిన నా కుమారుని జూచినట్లానందము గలుగుచున్నది.

చ. ఘనికలు గన్నా; దేహమున పుత్రగాత్రములతో దాకినట్లు నా
యలసట పోయె—తాపము, లయంబయె, చందనసాంద్రచంద్రికా
కలిత, హిమాంబుపూరగ నగరస్పర శీతలమైన భాతి నా
యులఁ తయణంగె నన్నుఁ! తనయా! ననుఁ జేరగరమ్ము; బిగ్గఁ గౌస్

(తొడపైఁ గూర్చుండఁ బెట్టుకొని)

ఏమి యీ మహానంద పారవశ్యము!

గీ. ఎవని కడుపుననో జనియించి నట్టి
వీని నాలింగనంబు గావించినంత
నా యనుగుపుత్త్ర ఖడ్గనారాయణుండు,
మఱపునకు వచ్చుచుండె విస్మయము నిండె.

అన్నట్టు—నాయనా! నీవు సర్వశక్తిస్వరూపుఁడ వంటివే! అంత యమోఘశక్తి నీయందున్నచో—నా కుమారుని, నీ శక్తిచేఁ దెప్పించి నా కీయవేల?—

ఖడ్గ—అయ్యా! ఇదియేమి న్యాయము! నన్ను మీరిప్పుడేకదా పెంచుకొంటిరి. మీ కుమారుని నేను తెప్పించి, యిచ్చినచో నీ రాజ్యమున కధికారి యాతఁడా నేనా—?

అ-వే—నీకే రాజ్యము నిచ్చెదను. అతఁడు, నీకు సేవచేయుచు, తమ్ముఁడై యుండును.

ఖడ్గ—అట్లాతఁడు సమ్మతింప వలయునుగదా! నాకేమి నమ్మకము?

అ-వే—అయ్యయ్యో! నాకుమారుఁ డట్టి యవిధేయుఁడు కాఁడయ్యా!—అతఁడు నా గీచినగీటు దాటఁడయ్యా! నేనేదుర్మార్గుఁడనై వానిని నింతఁ జేసితిని. నాయనా ఖడ్గనారాయణా! ఎక్కడ నున్నావురా తండ్రీ!

ఖడ్గ—అయ్యా! మీ విచారముం జూచిన కొలఁదియు, నాకు జాలియగుచున్నది పోనిండు. మీ కుమారుఁడు నాకు రాజ్య మీయకునిండు. ఈయక పోవనిండు. నే నిప్పుడే మీ పుత్త్రుని మీకుఁ దెప్పించియిచ్చెదను. ఒక్క క్షణము కన్నులు మూసికొనుఁడు.

అ-వే—(కన్నులు మూసికొనును.)

ఖడ్గ—వీరభద్రకళాపూర్ణులారా! మీ రీశస్త్రమును నాకడ్డముగఁ బట్టియుండుఁడు.

వీర-కళా—(అట్లు చేయుదురు)

ఖడ్గ—[రూపము మారి ఖిల్లుఁ డగును]

వీర-కళా—(కాండపటము తీసివేయుదురు)

అ-వే—ఆహా! ఏమిది? కేదారనాథా! మాకు ధరణికోట యుద్ధమున జయము గల్గించిన ఖిల్లుఁడు కనఁబడుచున్నాఁడు.

అందఱు—జయ్! ఖిల్లవీరునకు జయ్!-

వీర-కళా—(తిరిగి కాండపటము మూయుదురు)

ఖడ్గ—(అఘను వేషమునఁ గనఁబడును.)

వీర-కళా—(పటము తీసివేయుదురు.) ఏమిది? ఈ దుష్టుఁడు—అనపోతనాయునికి నాపై నలుకఁ గల్పింప—వెంకన్నకు లంచమిచ్చిన యాఘనులలో నొక్కఁడు!-

అనపో—అయ్యా! అఘనవీరా! నన్ను రక్షింపరమ్ము— ఈదురాత్ములు నన్ను బంధించి బాధించుచున్నారు

కొండా—ఛీ! దుష్టరాజభూతమా! ఇప్పుడు నిన్ను యాఘనుఁ డెవ్వఁడు రక్షింప వచ్చునా? నోరు మూయుము. వాఁడు నీ కన్నులయెదుట ఖండింపఁబడును, చూడుము. ఓసీ!—అఘను పిశాచమా! అప్పుడటు ఘనుని కడనుండి బంతికి పోయితివి; గాని, యీ రెడ్డిసింధనాన— వంటయింటి శశమువలెఁ జిక్కితివి. చూడుము; నిన్నేమి చేసెదనో—

గీ. నీచుఁ డైనట్టి వెంకన్నతో చెలిమి వ
హించి నాయందు నిందఁ గల్పించి శత్రు
రాజుచే నాకు నన్నుఁ బరాభవింపఁ
బేరిరణము జేసి తిప్పుడు నూతేఁడ్లువిండె.

క-వీ—[కాండపటము మూయుదురు.]

ఎఱ్ఱా—[కట్టుకొని] కొండారెడ్డిగారూ! ఏమి యీతొందరపాటు— ఇది కేదారనాథుని మంత్రశక్తి గాని నిజము కాదు.

కొండా—ఊఁ-కేదారనాథుఁ డెవ్వఁడో—నేనెఱుఁగక పోలేదు.

ఖడ్గ—(నిజాకృతిని దాల్చును]

క-వీ—[కాండపటము తీయుదురు.)

అ-వే—(పారవశ్యముతో వణకుచు] కుమారా! కుమారా! ఖడ్గనారాయణా! ఖడ్గనారాయణా! వచ్చితివా! (కౌఁగిలించుకొనఁబోయి మూర్ఛిల్లును.]

ఖడ్గ—[వగ్గఱకుఁ బోయి శిరస్సును తొడపై నుంచుకొని] హా! జనకా! నీకు నేనెంత దుఃఖముఁ గల్పించితిని!

సీ. అగ్రిపాంచత్త్వడ నరుగొన్నలనేగాని
యీ పుత్రశోకాగ్ని మొఱఁగనైతి
సంభవించితివంచుఁ బరితపించఁగఁ గాని
యీ న్యాయపాలన మొఱఁగనైతి
దూషకున్న నిన్నతి పాశించితిని గాని
భగ్నమైన నీ దేహము మొఱఁగనైతి
కఠినచిత్తుఁ గష్టపెట్టించితిని గాని
యిటులఁ గృశించు నీ వంచెఱుఁగనైతి
గీ. పుత్రజీవన జీవనాభ్యాసయు నిన్ను
తెప్పదంచితి; నీ ప్రేమఁ దలఁపనైతి
నీ సహాశ్లేష సౌఖ్య మందితిని గాని
యనుఁగు తనయ! నిన్నని దుఃఖ మందనైతి

అ-వే—[లేచి] తనయా! ఎన్నినాళ్ళకు నా కన్నులఁ బడితివి తండ్రీ! నా మొండి ప్రాణములు నిన్ను చూచుటకుఁ గదా యిన్ని నాళ్లు బ్రతికియున్నవి! నాయనా! నా ప్రాణములు నిలుపుటకు గదా నీవు తిరిగి వచ్చితివి!

47వ అనుబంధము.

ఖడ్గ—నా యపరాధములను క్షమింపుము. నాకై దుఃఖింపకుము. కన్నులు తుడుచుకొనుము.

అ-వే—కుమారా! అట్లయిన నీవును నన్ను క్షమింపవలసి యున్నది. కేదారనాధునకు నీ రాజ్యము నిచ్చునట్లు—వాగ్దానము చేసితిని. నామాట నిలుపుము. ఏఁడీ... ...కేదారనాధుఁ డెక్కడ!......

ఖడ్గ—నాయనగారూ! కేదారనాధుఁడు నాలోఁ గలసిపోయినాఁడు ఇఁక మీకు కేదారనాధుఁడు గాన్పింపఁడు.

అ-వే—ఏమీ! అట్లయిన నీవే కేదారనాధుఁడవా?

ఖడ్గ—ఒక్క కేదారనాధుఁడనే కాను. చిత్తగింపుఁడు.

సీ. అనపోతనాయని యాస్థానమందు క
వటవృత్తి నున్న యాఘ్రనుఁ డ నేన

కొండా—ఆఁ! ఏమీ! ఆశ్చర్యము! అట్లయిన మిగత యొద్ద ఘాఘ్రములు నెవ్వరు?

ఖడ్గ—ఒకఁడు నేను—ఇంకొకఁడు మల్లినాథుఁడు—మఱియొకఁడు కృష్ణరాజు—అనపోతనాయునికిని నీకును విరోధము గల్గినఁ గాని నీవు మా శత్రువునకు రావని శంకన్నను లోఁబఱచుకొని రాణితో నీకు సంబంధము నొనఁగల్పించి—బుద్ధిపూర్వకముగ ననపోతనాయునిచే నీకు పరాభవము చేయించితిమి. మమ్ము క్షమింపుము.

కొండా—ఆర్యా! మీరు చేయించినది నాకు పరాభవము కాదు, నిజముగా నాకు మహోపకారము.

అనపో—ఆహాహా! ఎంత మోసమునకు లోఁబడితిని:

రాణి—(భర్తతో) ఓ గుడ్డిరాజా! ఇప్పుడైన నిజము తెలిసికొంటివా?

అనపో—తెలిసికొంటిని—నేనేమి చేయుదును?

రాణి—ఏమి చేయుదువు. దుఃఖింపుము—ఒడిలోని త్రాచు పాములని యెఱుఁగక అప్తుల వేషములను విశ్వసించి రెడ్లను తలఁ దాల్చుకొంటివి. అనుభవింపక తీరునా?

అనపో—దేవీ! చచ్చిన బురదపామును కొట్టనేల?

రాణి—కొట్టుట చాలదు; నిన్ను చంపవలెను.

ఖడ్గ—సీ. అనపోతనాయునిఁ గొని తెచ్చి నీపాద
తలి నుంచినట్టి ప్రతిజ్ఞుఁడ నేనె

అందఱు—జయ్! ఖడ్గనారాయణునకు జయ్!

ఖడ్గ—సీ. ధరణికోటను దాసినఁగుల రూపడగించి
విజయమందిన భిల్లవీరుఁడ నేనె

పెద్దా—ఆహా! ఏమి యీ మాయాభిల్లుని చరితాపము!!

అందఱు—జయ్! మాయాభిల్లునకు జయ్!

ఖడ్గ—సీ. సభలోన నానాఁడు సల్పిన ప్రతిన దీ
ర్పంగఁ గన్న మీ యువరాజు నేనె

ఆ-వే—నాయనా! నీ ఖడ్గనారాయణ బిరుదమును తిరిగి నీకిచ్చితి. నేను యౌవరాజ్య పట్టాభిషేకమే కాదు పట్టాభిషేకమునే చేయుచున్నాను.

ఆ మునపటి నతి భాగమును దీర్పంగా లేము
పత్రిభుఁడ వీవె రెడ్డిరాజ్యమునకు
గాన నీ భుజాగ్ర కలితాసనంబున
పూజ్యయగును రెడ్డి రాజలక్ష్మి కిరీటముంచుచును.)

అందఱు—(కరతాళములు చేయుదురు)

ప్రధా— సభ్యు లెవ్వరును లేవవద్దు. ఇంకను విచారింపవలసిన యభియోగములు చాల గలవు. మీరు చూడవలసిన చిత్రమంతయు నిప్పుడే.

అ-వే— నాయనా! ఘనశూరా! ఇక్ష్వాకురాజన్యుఁడవే. కావున బంధితులై యున్న మన శత్రుదంపతులకు శిక్ష — నీవే — విధింపుము.

ఖడ్గ— కొండారెడ్డిగారూ! మీ యుద్దేశ మేమి?

కొండా— ఈ విశ్వాసహీనులకు జన్మాంతర కారాగృహ శిక్ష విధించినను పాపము లేదు.

రాణి— రాజేంద్రా! ఈ పిరికిపందయగు రాజును వివాహ మాడినందువలన నేను పతితనై యిట్టిగతికి లోనైతిని. క్షత్రియుని కడుపున నిట్టివాఁడు పుట్టెననిన నా కాశ్చర్యముగా నున్నది.

ప్రధా— సభాసదులారా! ఈవిషయమున నా మనవి యొకటి గలదు. రాణి సందేహము దీనితో దీరును. వీరభద్ర జననీజనకులు భిక్షకులై తిరుగుచుండఁగా — నేను మా యింట నుంచి రక్షించుచున్నాను. వీరారెడ్డి — యీ యనపోతనాయని జన్మరహస్యమును నాతోఁ జెప్పెను. ఈతని తల్లి పుత్రసంతతిలేక యొక దాసీపుత్రునిఁ దెచ్చుకొని తన తనయను దాసి కిచ్చివేసెను. ఇతఁడు దాసీపుత్రుఁడు గాని, క్షత్రియుఁడు గానేరఁడు. ఆ దాసి కొసంగఁబడిన బాలికయే నిలయాంట. దాసి తన మరణకాలమున వీరారెడ్డిచే పోషింపఁబడి ఈ రహస్యము నతని కెఱిఁగించెనఁట!

రాణి— ఆ! ఏమి? నే నెట్టి ఘోరమైన వాక్యములను వినుచుంటిని. ఈనీచుని ప్రవర్తనను నేను తొలినుండియును సందేహించుచునే యుంటిని. పూజ్యులైన నా వంశమున కీదుష్టునివలన తీరని మచ్చ ఘటించెను. ఎన్నినా ళ్ళజ్ఞానమున నెఱుఁగక నీతోఁ గాపురము చేసితిని? ఛీ! ఇఁక నాకీ జన్మమేల? వీనిని సంహరించి నేనును వీరశయ్యన నలంకరించెదను. (బంధనములు త్రెంచుకొనును)

అనపో— రాణీ! రాణీ! సాహసింపకుము.

రాణి— ఛీ! బానిసా! నాకింక శాంతి యెక్కడిది? మన మిరువురము బ్రతికి యీ రవ్వఁ బరాభవము నంగీకరించుటకన్న మరణమే శ్రేయమని నీకేల తోఁచదయ్యెను. చావు దురాత్ముఁడా!

(రాజును చంపి తానును పొడుచుకొనును)

అంద— హా! ఘోరము — ఘోరము.

ప్రధా— న్యాయస్థానమందిరము శవసహితమగుట శ్రేయము కాదు. తొలఁగింపవలయును.

(భటులు వెడలి తొలఁగింతురు.)

ఖడ్గ— కొండారెడ్డిగారూ! పాపము తొలఁగినంతయు మీరు వీరభద్రుని వలచి యుంటిరే! ఆమె యిప్పుడు మీకు కావలెనా?

కొం—ఛీ! వెలటా! తెంగరివై యింగటి సభలో నొక తుంటరి నాలింగనము చేసి కొంటివా? నిన్ను చంపకనుండుదును.

అన్న—(నవ్వుచుండును.)

కొం—ఏమి నవ్వెదవు? నన్ను వెర్రివానిగాఁ దలఁచితివా?

అన్న—బావా! నేనే గెలిచితిని.

కొం—ఛీ! నీవు గెల్చుటేమి?

అన్న—నాడు చెఱసాలలో నేనే గెలుతునంటి నే! మఱచితివా?

కొం—ఔను జ్ఞప్తియున్నది? ఏదన్న?

అన్న—అటు చూడుము—

[విక్రమరాజు నీలగా మారును]

కొం—ఈ బాలయెవ్వరు?

అన్న—విక్రమరాజు

కొం—ఈమె నీలగాదా? నీల చచ్చెనని వింటినే?

నీల—నీలచచ్చి విక్రమరాజయ్యెను. విక్రమరాజు చచ్చి నీలయయ్యెను నీలావిక్రములకు భేదమేమున్నది

కొం—ఔరా! ఏమి యీమోసము ఈవనిత యిన్ని యుద్ధములను పురుషాకృతులను ధరించి చిత్రవిచిత్రములొనరించెరి కాబోలును.

అన్న—బావా! నేనే గెలిచితినా?

కొండా—మరదలా! నీవే గెలిచితివే?

ఖడ్గ—జనకా! ఈవీరభద్ర సంగ్రామమున నా ప్రాణములను రక్షించినది ఈమెయేను పురుషాకృతులతో మనకు జయముగూర్చిన నీలాన్నపూర్ణలకును బహుమానములు చేయవలయును.

అ-వే—నాయనా! అదే నేనును చూచుచున్నాను. ఈ రెడ్డివిజయ సందర్భమున వీరభద్రా ఖడ్గనాయకులకును, అన్నపూర్ణాకొండారెడ్డులకును, నీలాకృష్ణరాజులకును నా చేతులతో కల్యాణములు చేసి కృతార్థుఁడను కాఁగోరుచున్నాను. అదిగాక అనపోతనాయని తమ్ముడగు మాధవనాయుఁడు ధరణికోట యుద్ధమున మరణించి నందువలనను, దాసీపుత్రుఁడగు ననపోతనాయని యనంతరము రాచకొండకు నిజమైన వారసురాలు నీలయే కావునను, నీలాకృష్ణరాజులకు తద్రాజ్యము నొసంగుచున్నాను.

అందఱు—[కరతాళములు చేయుచు] రెడ్డిరాజ్యలక్ష్మికీజయ్! రెడ్డిరాజ్యలక్ష్మికీజయ్!

(యథావిధముగా కల్యాణములు చేయుదురు.]

మంగళం, మంగళం మహత్ శ్రీ శ్రీ శ్రీ

## గద్య.

ఇది శ్రీ సోమరాజాన్వయ పయఃపారావార రాకాసుధాకరుండును,
కోదండరామ చూడమాంబా గర్భ శుక్తి ముక్తాఫలంబునను,
శ్రీభద్రాచల సీతారామచంద్ర వరప్రసాదలబ్ధ కవితా విభాసి
తుండును, భారద్వాజస గోత్ర పవిత్రాపస్తంబ సూత్రుం
డును, నగు దేశపాండ్య రామానుజరాయ కవివరేణ్య
ప్రణీతంబైన రెడ్డిసంగ్రామవిజయ నామాంతరంబగు
ధరణికోట నాటకంబున సప్తమాంకము
సర్గంబును సంపూర్ణము

★

# అనుబంధములు

## 1. అన్నపూర్ణ—కన్నడ—ఆది.

ఓహోహో । సుకుమారుఁడో యీతండూ ॥ఓ॥ సరసిజముఖ దగు । ముఖకమలము గన । సంతస మయ్యెను కల్యాణీ ॥ఓ॥ భువి కే తెంచిన యిందుఁడో । పూర్ణకళాయుత చందురుఁడో । సుదతి యింతటి సుందరుఁ గనుగొన । కనులకు విందై కనుపడెఁగా ఆశ్చర్య । మయ్యెగా । దినకరు విధమున । వెలిఁగెడుగా ।ఓ।

## 2. వీరభద్ర—బ్యాగ్—ఆది. (ఎంతటి పురుషార్థంబునుచు వలె)

ఎంతటి పరిహాసంబుఁను గావించెదవో । ఓతరళేక్షణ నీ ॥వెం। స్వాంతము నందున ననుమానింపక । సరసిజముఖి నా । నరు నటిఁగిం వ నీ ।వెం। (పాఠ) ఆ మదీయ మానస చోరుండు । అభిమాన। ధనుండు । మనసిజ తేజుఁడూ ।ఆ। మదనసమునిఁ బొగడనిమది నిదురను సుఖమును విడచితి । నాథీరుని పొడగాంచెద । నెటుగాం చిన నీ ॥వెం॥

## 3. వీరభద్ర—హనుమతోడి—ఆది.

విమలోజ్వలాంగినా । వెతనెంత దెల్పుదు ।వి। జలజాత నేత్రునిగూడు టెనాటికో ।వి। 1. జనకుఁడు ధరణికోట । జననాథ పుత్రుని । సఖ యరో నాకుఁ గూర్ప । సంకల్ప మొనరించె ।వి। 2. నిన్నటి రాతిరి । నెన్నో విఘ్నంబుల । ననుఁగూర్చి మనవారు । తలపోసి నారమ్మా ।విమ।

## 4. ఖడ్గనారాయణుఁడు—బేగ్ పలాస్—రూపకం.

ఆహా నే ధన్యుడన్ । అనుపమగుణ మాన్యుఁడన్ ॥ఆ॥ దేహ గేహములు పవిత్ర । తనుగని । నఘములు నమసెను ।ఆ। చెఱుకు వంటి జోదు । విడ । చిన ఫిరంగిగుండు । చెదరి హృదయ సీమనెల్ల । విశావికలు జేసెను ॥ఆహాహా॥

## 5. ఖడ్గనారాయణుఁడు— సురట —త్రిశ్రగతి.

ఏమనివర్ణింపఁగలను । భామాసౌందర్యమహిమ ॥మే॥ కాముని చేములికియో ।జ॥ కన్నులయుగు కలికియో ॥యే॥ మోహన రూప

విభాసిత । ముఖజిత చంద్రవిలాసిత । యూహో కనులకుగట్టిన । యటు లదోచు సుందరి । నే ।నేమ।

6. కొండారెడ్డిబ్యాస్—ఆది. (హరహర నాసోదరునిటువలె)

ఆ వీరభద్ర గావించినయూ - హంతక, దుర్గంపక వీడెదనా- చోరుఁడుపాపవి - చారుఁడు కలుషవి - హారుఁడు సుగుణవి - దూరుఁ డుగా ।ఆ। ఖలుఁడుమా - ననమునము-త్సరమున మా-నవతిగ నెన్ ।ఆ। (సాకె) ఆకలుష విచారుండు - ఖడ్గనారాయణుఁడూ - హా మదీయ మాతులాంతః పురచోరుండూ-పద్మనాయ కాఖండరాజ్య గర్భవైరుం డూ - రెడ్డిభూనాధాభి మానుండూ -(మి(తి) పద్మనాయకులను - బరి మార్పగానెంచి - బద్ధవైరముబూను పాపాత్మ నమ్మెనా-ఖండఖండ ములుగ - గావింతుగా ।ఆ।

7. అన్నపూర్ణ—కిన్నడ—ఆది. (శపము సిడుమమ్మావలె)

కోపము విడుమయ్యా - మామీఁదనీ ।కో। నీపయిసుంతయు - పాపము దలఁపము ।కో। విమల శీలసా - ధు సుగుణజాలను - విప్ర శచరితను - వీరభద్రను - ఎన్నికష్టముల ముంచనున్నావో - నీ పాద ములను - నిరతము గొలిచెద ।కో।

8. అన్నపూర్ణ—మోహన—రూపకం.

ఇంత నిరాకరణము నీ - కేలఁ కలిగెనో నాధా ।ఇం। వంత గించి - భ్రాంతిముంచి పరిభవించుట యిదివాదా ।ఇం। మఱదలిపైఁ గృపారసము - మఱచితివో - గుణభూషణ - కరుణలేక - కఠమునీక- కఠినగుణముఁ జూపెదవా ।ఇం।

9. కొండారెడ్డి—భాగేశ్వరి—ఆది.

పోపకతి - నయమున భయమున - వీరభద్రతోడ దెలుపు కొమ్మా ।పో। క్రూరుఁడైన ఖడ్గనారాయణుని - గోని ముక్క-ముక్క- లుఁగ నొనర్చెద - నింకనైన నన్నుఁ గోరుమనుచును - పలుకుమా - తెలుపుమా - నిరంతరము ।పో।

10 నీల—బంగ్లా—ఆది—(హా మకురగాసి వలె)

హా - కృపారాశి నీకు దెల్పఁగా - దుః - ఖంతువీ- వేమొసో దరా హా- నేనొకహతభా - గ్యనుఁగాథరపము - నే సౌఖ్యంబు నె- ఱుంగనేనతము హా- ఈదురాత్మునకు బానిస వయుటు - లిఖమల నందుచు - నుంటినీపుని - నిర్మలముగునీ - వదనాంబుజమును - నీక్షిం పగ జీ -వము లభించెనకటా-కృపారాశి-

11. నీల—కన్నడ—ఆది.

అనాథనైతిని వు- ణ్యాత్మ నే-నా- ఘనయానమున గాసిలు చుంటిని - జనాధిపుఁడు రో-షంబువహించెను - మనంబునందున నల తఁగంటినిను - వినారక్షణము గానను జగతిని అ-

12. ఖడ్గనారాయణుఁడు—మోహన—ఆది.

అభయముఁగొమ్మా - యతివాలెమ్మా - యనయము భయ రహితాత్మవుగమ్మా అ- పాతకుఁడగునన - పోత ధరావతి - ప్రాణ ములిఁక నెడబాయుననుమ్మా - అ-

13. పరిజనులు—బ్యాగ్—చాపు.

మహారాజ రాజాధిరాజా - మహనీయ కవి కల్పభూజా -మ- అహా నీప్రతాపంబు - లాశాంతరములంటి- యరులకు బ్రతారించు భూవరా-సమస్తరిపు భయంకరా - పరాకు భూవరా -మ-

14. మల్లినాధుఁడు—బ్యాగ్—ఆది తాళం.

ఔరా- మీారలిటుల తారులఱది మాతను వరభవింపఁ దగు నా ।ఔరా। కూ్రరులగుచు ధీరులగుచు - న్యాయాన్యాయము లా వంతమైన - మదిని దలప కిటు పరుషము లాడందగునా ।ఔరా।

15. వీరభద్ర—మాయామాళవగౌళ—జప్ తాల్.

ఈవియోగ మహాంబు - నిధి నెట్లు దరియింతు ।ఈ। నావీర వరుని న - ఖ్యంబెటుల నమకూడు ॥ఈ। ఖలుండు కొండారెడ్డి కారా గృహమున కో - మల శరీరుని నతని బంధించెఁ గటకటా ।యీ।

### 16. డైలాగు—బీన్ ఫలాస్—రూపకం.

(అన్న) కళ్యాణీ - నీయాత్రిన్ విడుమా - బాలామణిరో-నాయానగ్ గొనుమా ॥క॥ (వీర) పతివెతలక్ గుమవగా - మనంబున నే నేరీతిన్ - మనియెదగ్ (అన్న) వనజనయన వేమరు నిటు - వగచిన ఫలితము గలదా। (వీర) శశివదనా - బ్రిదుకగనా - తరమగునా తమునా (అన్న) శుభమగు - విషయము - దెలిపెద ।క॥

### 17. వెంకన్న—బ్యాగ్—ఆదితాళం.

చూడుచూతూ ।నా। యందము చందము నెంద్రైనగలదేమొ ।చూ। నాదు మొగము తీరూ - తీ-ర్రైన కనులసారూ - నా పెదవి సుధలుగారూ - భా - వింపగ నుతిమీరూ - నన్ను బెండ్లియాడిన నీ కెన్న సుఖము చేరూ - కలికీ - మరు ములికీ - కమలముఖ ॥చూ॥

### 18. అన్నపూర్ణ—బ్యాగ్—ఆది.

మూతివండ్లు రాలగొట్టెదను చూడరా - పోపోరా ముఃలీ ।మూ। నీతిమాలి నా - తోపరిహాసము - నింద్యమతిని జెడనాడెదవా నాతులమొగ మెన్నడుఃగనలేదా - వాచిపోయెదవు - వారల గనుగొని ॥మూ॥

### 19. అన్నపూర్ణ—సురట—రూపకం.

నడు - వీధిలోన నవ్వులాటలేలా - నడునడు ।నడు॥ పడుచుతన ముబాసెన్ ।కడు। మునలితనము డాసెన్ - నడకలు తడబడుచు న్నవి - ముడతలుబడె కాయము ।నడు। ఇట్టిప్రియమందా - నీ - కిట్టి గుణము వింద్రా - మట్టిమైనపిదపగాని - మానవా గుణంబును ।న।

### 20· ఖడ్గనారాయణ - పూరి - ఆది.

దయాభరణ యాత్రశరణ్యా ॥రిపు। భయాహారణ ఘన - పతిత పావనా ॥దయా॥ స్వయంభూ - గుణాతీత - మాధవా - సకలదనుజ వంహార కేశవా - సారసాక్ష లోకరక్ష - బ్రోవగ - సమయమురా- వరగునరా - రాహరి ॥దయా॥

## 21. అన్నపూర్ణ - ఆదితాళం.

మధు-పానమిదే - వరదానమిదే - ద్రా - క్షారసంబు దీ
లోకా ॥మ॥ రుచిచూచినంత కషుమీరా - సరి, దీనికీ భువిని ఘూ
టా - ఘనసుఖజాలములకు బాటా - సుందరి దొరికిన సయ్యాటా
:మధు: రవ్వంత దీనిరుచిచూడూ - మేలైన జావళిల్యాడూ - మాంసా
హారమునకు తోడూ - తెలియకుండ తైతక్కలాడు :మ: పరసుఖ
ములీయఖామంగా - దు - ర్భరదుఃఖమునకు మందూ - ఆ - సంచమై
వదమందూ భళి - దీనిమహాత్మ్యము నేమందూ ।మధు।

## 22. వెంకన్న - ఆది. [పరదేశీసయ్యా వలె]

ప్రతివాఁడూ నన్నూ - తాతాతాతా యంటాండేఁ పాపమో
సంతాపమో - పరితాపమో :ప్ర: చెవిటివాఁడవను నొకతే - రేఁ -
జీకటియను వేరొకతే - పండుతలను గని - ముసలివాఁడవని - పరి
హాసములాడు నింకొకతే :ప్ర:

## 23. కొండారెడ్డి - బ్యాగ్ - ఆది.

హారుడే - వరభీ - కరుఁడై - వెడలిన - సతనిని బ్రిదుకగ
విచ్చేదనా - సురనా - ధుఁడునే - నలతో గవిసిన - శూరతఁ జూపక
విడిచెదనా :హా: నిరుపమ మగునా - భుజాబలంబున - నిఖిలశాత్రవు
లబరిమార్తున్ శౌర్యంబు జూపింతు - ధైర్యంబు దీపింతు - వారిం
పంగ లేరింకెవ్వాఁడులున్ :హా:

## 24. డైలాగ్ - బ్యాగ్ - రూపకం.

మాధవ—భీతిని బొందకుఁ డింక ని - శాతకృపాణంబులవి -
ప్రాతముఁ గూల్చెదు పరిజనులారా :భీ: పాతకుల నెల్లఁ బరిమార్చి
వనఁ దూల్చి - పోకార్చ రే ధృతిమీర :భీ: (పరి) మీపదసేవల నే-
పారఁజేసెను - మీపరివారముగా మా కోపంబు దీపింప - తాపంబు
రూపింప - కడదేర్తు మతిదీప్తిమీర - (మాధ) :భీ:

25. అరపోతనాయఁడు—హిండోల్—రూపకం.

నా - కేమో - తోపదా మెగా - ఈ చిత్రమూ -వి-నూత్న
మూ మహాబ్రిమూ :నా: భీకరాగ్ని కీలలలో - విమలసుధా మయ
సౌధము - లీ కరణిని గాలుచుండ - నిట్టి విపద్భర హేతువు :నా కే:

26. డైలాగ్—బ్యాన్—చాపు.

అంగజు—దుష్టస్వరూపిణీ - దురితప్రచారిణీ - నిష్ఠురంబులు
నల్వురమిటుగనుమీ :దు: (నీల) తిశ్ర—ఓదయా హృదయులారా-
రోగాగ్రపాత్ములారా - సాదరులైననుఁగావుడు నదములాగులారా
(అందజు)—(చతురశ్ర) ఓకటిలాత్మక యిటువినవే - భీకరశరమును
గనుఁగొనవే - నీకొనరింప మహాయముమూరిపు - నిజమర్మంబులు
దెలుపఁగదే :దుష్ట:

27. ఖడ్గనారాయణుఁడు—హిండోల్—ఆది.

శా - పాడక - ఇదే- సమయమురా అలల :శా: [తిశ్ర] ఈ
పాపాత్ములు శాత్రవు - లిపుడునను వధింపదలచి - రాపద్బాంధవనను
నద - యాత్ముడ వైరక్షింపుము :శా: శ్రీవతిసీదాసుండను - ప్రాపె
వ్వలు లేరు నాకు-నీపయి భారమునుంచితి - గోపాలక కుజనశిక్ష :శా:

28. కొండారెడ్డి—టీక.

ఎంతటి-యవమా-నమూ:ఎం: ఘటియింపగా-అఅఅఅఅ:ఎం:
అదరక శాత్రవుఁడఁడచిన-నుదుటిపై న గాయమయ్యె-పరాభవము న
టుసైచెద-ప్రాణభంగ మైననునా :కెం:

29. అనపోతనాయఁడు—బ్యాన్—రూపకం.

పుడమిదిరుగ-నడలుగదుర-చనుఁడుశూరులారా :పు: గడగడన్
వడంక జగముఁ గదలుడిక కడంకన్ :పు: (సాకి) పద్మనాయక వీర
వైరిశిఖామణులు-భస్మవేషులగు రెడ్డిరాజు—ధములూ-అడలక -ననయ
ము-బారి-గొను డికగొండల మందకుఁడీ :పు:

30. డైలాగ్—బ్యాగ్—ఆది.

కొండా—వీరినికె—నాదుకర—వాలమునకు బలి-నేసెద - జేసెద-
ఘాతబలికి :వీర: శూరత గూర్చెద ధీరత బేర్చెద-శోణితమును భువి
గార్చెదగా :వీర:

31. ఖడ్గనారాయణుడు—సారంగ—కురుజంపె.

ఘోరాపరాధినై-కులధర్మమును విడిచి :ఘో: ఫీసుండ నయ్యెకా -
రాగారమును బడితి :ఘో: రాయబారము జేయ - రాచకొండకు జేరి-
యనపోతనాయుని స - భారంగమున నటుల-అన్యాయబంధనము- లంది
యవమానమును-ఘటియించి మీామనసు కలంత పరచినఖలుడ :ఘో:

32 వ అనుబంధము గ్రంథమధ్యమున గలదు.

33. అనపోతనాయుడు—బ్యాగ్—ఆది.

చెదరిన హృదయము పదిలపరుటకిది శ్రీకరమగు సారా
యీ:చె-అదటును బాపగ-హాయి నీజూపగ - నను వైనదిసుఖదాయీ
:చె:నిదురనుగూరుప-నిధనముకూరుప-నిజమైనది వరదాయీ - వదరగ
కోరిక-వదలకనీరిక-లెత్తించుట కిదిఫాయీ :చె:

34. అనపోతనాయుడు - సురట - ఆది.

అనవసరముగా-సాక్ష్యము - లేని నింద-లిడదగదొక శూరునిపై
:అ: నిజపుమాటబల్కక- ఋజువుచూపి తెల్పక - శిక్షింతువాని
:అ: అన్యుడతడు గాడు గౌరవాస్పదుడై నయట్టి కొండారెడ్డిపైన -
దుర్దయంబులను బలుకుచునుంటిరి - ద్రోహికాని యెడమీాశిరము
లూడు :నన:

35. ముగ్గురుపఠాణీలు—బ్యాగ్—ఆది.

అగునని కాదనియీా రాద్ధాంతములిపుడేలా - వినరాదా నిజ
ము గనరాదా-విపరీత సిద్ధాంతంబులేటికి :అ: మీావయికొండారెడ్డి

యొంత ద్రోహమునల్పుచుండెనో యెఱుగరుగా ఎఱుఁగకీరీతి నిండెను గోతిలోనబడుటకు లజ్జింపరుగాదా :అగు:

36. అనపోతనాయఁడు—బ్యాగ్—ఆది.

చాలుచాలునిక సరసమూ-నీ-సంగతి దెలసెను తులువా పలువా :చాలు: వేళాకోళములయ్యోనా-నను-వెఱ్ఱివానిఁగాఁదలచితివా - కాలుని వీటికిఁబంపగలనునిను-కాచుకొమ్ము హంతకారి జారిణి :చాలు:

37. కొండారెడ్డి—బ్యాగ్—ఆది.

తగునా - మీరీటు పలుక - రాణియనఁగ - మానవతిగదా - అల లయునక - గృహిణిఁగనక - :తగు: అనుపమ శుద్ధాంతనివాసినియే - యామునాకు మాతాసన్నిభయే - కనగలోక జనయిత్రివంటియా - ఘనశీలను గులటయనగ నిటువలె :తగునా:

38. కొండారెడ్డి—బ్యాగ్—ఆది.

ప్రశ్రయంబు జనించినగానీ పరి - పంథికులము మాసిన గానీ శశవశ మందగఁజేసెద వైరుల-ఖరాసి ధారల కెరగావించెద :ప్ర: కులవినాశంబు గలుగఁగ రాజుల గొలిచి యింత దుర్యశ మందితిగా :ప్ర: ఖలుడనై - దురితమున్ - సలిపితిన్ - చపలతన్ - విలసితాన్వయ ప్రతిభఁగంగను - వెలయించితి - నికజూపెద - ధీరత :ప్ర:

39. కొండారెడ్డి - బ్యాగ్ - ఆది.

దారికితివేగా - దుర్మదచోరా - దుష్టుఁడవే యఘచారా - చిరబిర నిన్ను - ఖరాసి ధారను-బరిమార్చెదరా క్రూరా :దా: పరాక్రమించితివోరా - బిరాన నిన్ను ఘోరా - రణ్యంబునందే భీకరగతి ప్రా - ణంబులు దీసెద నోరోరా :దా:

40. కొండారెడ్డి—ముఖారి—చురుజంపె.

దైవమా నేనేమి - తలచి యొనరించితినో - యావిధము నేటికి మృషాకథన మయ్యెగా :దై: పావమని ఖడ్గనా - రాయణునిఁ గూల్చితిని - యనవేమ పతికి నే - మని వార్త వినిపింతు :దై:

యెంత్రదో-హాముసల్పుచుండెనో యొటుగరుగా ఎటుఁగకీరీతి నింబెను గోతిలోనబడుటకు లజ్జింపరుగాదా :అగు:

36. అనపోతనాయఁడు—బ్యాగ్—ఆది.

చాలుచాలునిక నరసమూ-నీ-నంగతిదెలసెను తులువావలువా :చాలు: వేశ్యాకోశములయ్యెనా-నను-వెఱ్ఱివానిఁగాఁదలచితివా - కాలుని వీటికిఁబంపగలనునిను-కాచుకొమ్ము హంతకారి జారిణి :చాలు:

37. కొండారెడ్డి—బ్యాగ్—ఆది.

తగునా - మీరిటుపలుక - రాణియనఁగ - మానవతిగదా - అబలయనక - గృహిణిఁగనక - :తగు: అనుపమ శుద్ధాంతనివాసినియే - యామెనాకు మాతానన్నిభయే - కనకలోక జనయిత్రివంటియా - ఘనశీలను గులటయనగ నిటువలె :తగునా:

38. కొండారెడ్డి—బ్యాగ్—ఆది.

ప్రళయంబు జనించినగానీ పరి - పంథికులము మాసిన గానీ శకలశకల మందగఁజేసెద వైరుల-ఖరాసి ధారల కెరగావించెద :ప్ర: కులవినాశంబు గలుగఁగ రాజుల గొలిచి యింత దుర్యశ మందితిగా :ప్ర: ఖలుడనై - దురితమున్ - సలిపితిన్ - చపలతన్ - విలసితాన్వయ ప్రతిభఁగంగను - వెలయించితి - నికజూపెద - ధీరత :ప్ర:

39. కొండారెడ్డి - బ్యాగ్ - ఆది.

దొరికితివోగా - దుర్మదచోరా - దుష్టుఁడవే యఘచారా - చిరచిర నిన్నీ - ఖరాసి ధారను-బరిమార్చెదరాక్రూరా :దొ: పరాక్రమించితినోరా - బిరాన నిన్నీ ఘోరా - రణ్యంబునందే భీకరగతి ప్రాణంబులు దీసెద నోరారా :దొ:

40. కొండారెడ్డి—ముఖారి—ఝంపె.

దైవమా నేనేమి - తలచి యొనరించితినో - యావిధముచేటికి మృషాకథన మయ్యెగా :దై: పావమని ఖడ్గనా - రాయణునిఁ గూల్చితిని - యనవేమ పతికి నే - మని వార్త వినిపింతు :దై:

## 41. కేదారనాథుఁడు - బ్యాగ్ - ఆది.

ఇదె వచ్చితి నీపాలిణముఁ గా హరియింపగ - క్షణకాల - మా
గగా :ఇ: మదహంకార వినోదుండవగుచు-మూఢోధకధి ముంచితివా
మమ్ముల - సదయాత్ముఁడనై - వ్రతిజ్ఞాభంగ - మాచరింప దలఁచి
తివాతలపకి :ఇ:

42 వ అనుబంధము గ్రంథ మధ్యమున గలదు.

## 43. అనపోతనాయఁడు.

విచారముల కిదిమాదూ సుఖ పరిచారముల కిది ధామందూ
:వి: విచారములకు గ్రి - హాచారము లకూ - వివాదములకును -
పేరగుమందూ :వి: మాలుమారి నీయుగ నిందూ - బల్ - ఫవందయిన
దీమందూ - టక్కరి వేదాం - తములు బలుకు దు - ష్టాత్ముల కే
అంగరాదిల నెందూ :వి:

## 44. రాణి—ఆది.

ఛీ! మొదల కిబ్రిదాకు - కడు శూరత్వమును గనుబరచితి
కడు రణశూరత్వంబును గనబరచితి ఛీ! కటకట సద్వంశమున జని
చియుఁ - గల మమంచు నీ మనమున దలఁపక - సిటుల సురాపాన
పరిమత్తతను - హీనుఁడవై మగసినుల పధింపఁగ :ఛీ:

## 45. వెంకన్న—బ్యాగ్—త్రిశ్రగతి.

చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం - చుం -
చుం - చుం - చుం - చుం నీకూ నాకీరాత్రి చుం - లేకుంటే
దచ్చేనే చుం లు ల్లూ - లు - ల్లూ లు - లూ - లూ - లూ
లూ - లూ - లూ లు నాదు నాకడ పోకడలూ - చూచీ యూర్ప
వె దీవ లూ దు - డ్డూ డూ - డూ - డూ - డూ - డూ
డూ - డూ - డూ - డూ - డు.

### 46. అన వేమారెడ్డి—కన్నడ—రూపకం.

ఎన్నడునా చిన్నిసుతుని - కన్నులారఁ గాంతునో :ఎ: మన్నించి నాయుంకపాళి - మరలసింకోశ పరిశేత్తునో సభలోన బరిభవించుట - చాలకగదు నోగాడితి అథము శుభము నెఱుఁగనిసుతు - నాయునెలలు శిక్షించితి :ఎ:

### 47. అన వేమారెడ్డి—భాగేశ్వరి—ఆది.

ఎన్నిదినములకు - కన్నులఁబడితివో - యన్నానాథుల దీపము- తనయా :ఎ: ఎన్నిశ్రీమలుసహి - యించితివోకద - నన్నేమవిదూషించితివోసుత - పన్నగనడవుల - లోపడుమల - నా - పన్నుఁడవై గాంచితివో గుణనిధి :ఎన్ని:

### 48. మంగళ హారతి—బ్యాగ్—త్రిశగతి.

మందరధర - మంగళకర - మంగళంబురా - మారసుందరా- శ్రీరమేశభోగ్ర :మం: దానభరణ - దోషహారణ - దానవేశనాశా - శ్రీనివాసజగదీశా - శ్రీరమా - నాయకా - జగన్నాయకా ;మం:

ధరణికోట అనుబంధములు సంపూర్ణము.